

780

# భక్త్యాంజలి

పాలపర్తి నరశింహం

ప్రకటనకర్తలు:

నమ్మాళ్వార్స

పోస్టు బాక్సు ౩౫౧

మద్రాసు

౧౯౫౮

{ వెల అరు అణాలు
{ లేక ఒక షిల్లింగు

# మేలురకము వజ్రములకు




## సురాజ్ మల్స్

313, ఎస్ప్లనేడ్, మదరాసు

# భక్తాంజలి

Bhaktanjali




గ్రంథకర్త:
పాలపర్తి నరసింహం.

Palaparti Narasimham

నమ్మాళ్వార్స
౨౧, స్ట్రాటన్ ముత్యాలమొదలి వీధి,
పోస్టుబాక్సు నెం ౨౧౮౧, మద్రాసు.



౧౯౩౮

వెల ఆరు అణాలు లేక ఒక షిల్లింగు

గ్రంథకర్త పాలపర్తి నరసింహంగారు. బ్రహ్మసమాజిక ప్రపంచంలో ప్రసిద్ధులు. సుప్రసిద్ధవక్తలు. జననం గుంటూరు మండలం. ప్రస్తుత నివాసం గుంటూరు. విద్యాభ్యాసం మొదలగున వన్నియు అచ్చటనే. వయస్సు షుమారు ఏబది. 'ధర్మసాధని'—పక్షపత్రిక—సంపాదకులు.

ఈషణత్రయముచేతను, తాపత్రయముచేతను దహింపబడు మానస క్షేత్రములను వ్రాతలచేతను వాక్కుచేతను మొలకలెత్తించి, పుష్పింపజేసి, ఫలింపజేయగల సమర్థులు; ఆచార్యులు.

ఇందలి ప్రార్థనలు ప్రకటిత పూర్వములే! గ్రంథకర్తగారి స్వయం కృతములుకొన్ని. కొన్ని పండితశివనాథశాస్త్రి, పండిత సీతానాథతత్వభూషణులు, సతీశచంద్రరాయి మున్నగువారి ఆంగ్లవంగరచనల కనువాదములు. అయినను ఎన్నిమారులు విన్నను, కన్నను చదివినను, హృదయానందకరములే! భగవన్ మహిమలోగల విశేషమద్దియేకదా!

భక్తిసూచితములగు ప్రార్థనలన్నియు, గీర్వాణాంధ్రములందు, ఛందోనియమితములై యున్నవి. ఆ కొరతను తీర్చిన వీరచనలు. భాషా విషయకముగగూడ వీటి కొక గౌరవస్థానము కలదని మా యభిప్రాయము.

పద్యములు, చి. నరశింహం, ఆ. సోమనాథరావు, వ. సుబ్బారాయుడు గార్లవి. వారి కెల్లరకు మా వందనములు.

౧౯౩౮ వ సం॥ శ్రీ... పుస్తకములు ప్రకటింప వలయుననెడి మా సంకల్పము ఈ గ్రంథముతో పూర్తియగుచున్నది. ఇట్టి అవకాశమును మా కొసంగిన 'దయామయు'నకు భక్తిపూర్వకముగ నీ 'యంజలి' సమర్పించుకొనుచున్నారము.

జమ్మిలి నమ్మాళ్వారు.

# భక్తాంజలి

పరమేశ్వరా! నీవే నా తండ్రివి; తల్లివి. నా ఆత్మకు ఆత్మవు. నిస్సంశయ చిత్తముతో నా మనశ్శరీరముల నీ యొడిలోఁ జేర్చి గతరాత్రి యందు నేను సుఖముగా నిదురించితిని. కేవలము అసహాయుఁడనై నిద్రావస్థలోనున్న నన్ను నీవు సర్వవిధముల కాపాడితివి. పరమ కృపాళుఁడవై నీవు సృష్టించిన పదార్థనిచయమును ననుభవించుటకును, పవిత్రమైన నీ యిచ్ఛను నా జీవితములో పరిపాలించుటకును, అపారమైన వాత్సల్యముతో నన్ను నీవు సుషుప్తినుండి మరల మేల్కొల్పితివి. నా నిద్రావస్థలోవలె ఈ జాగ్రదవస్థలో సయితము నీవు నాకు సమీపస్థుఁడవే. నీకంటె లోకమునం దే స్నేహితుఁడును నాకు సమీపస్థుఁడు కాఁజాలఁడు. నా యూహలను నా భావములను నీవు ఉత్తేజింపఁ జేయుచున్నావు. మఱచిపోయిన సంగతులను నీవు తిరుగ నాస్మృతిపథమునకు తెచ్చుచున్నావు. నేను చేయుచున్న యీ ప్రార్థనను సయితము నీవే పురికొల్పుచున్నావు. ఇంద్రియముల ద్వారమున అద్భుతమయిన నీ సృష్టిని నేను గ్రహించునట్లు నియమించుచున్నావు.

చిత్ర విచిత్రమయిన యీ విశ్వముయొక్క సౌందర్య గాంభీర్యముల తిలకించుటకును, విందరి మనోజ్ఞములయిన ధ్వనుల నాలకించుటకును, వాని తాత్పర్యమును ఉద్దేశమును గ్రహించుటకును నీవు నాకు కావ

లసిన శక్తిసామర్థ్యముల ప్రసాదించితివి. నేను గడపవలసిన యీ నూతన దినమునందు అడుగడుగునను నీవు నాకు సాయముచేయ సంసిద్ధుఁడవయి యున్నావనియు, నా విధాయక కృత్యముల నిర్వహించుటకును ఈ దినమునందు నాకు రానున్న ప్రలోభనములను తప్పించుకొని నేను నిష్కళంక చరిత్రుఁడనయి యుండుటకును నీవు నాకు తోడ్పడ నుద్యుక్తుఁడవై యున్నావనియు నేను నమ్ముచున్నాను. స్వామి! ఒక్క క్షణమయినను నన్ను విడనాడకుము. నాకు సర్వదా సహవాసివై యుండుము. నేఁడు నీవు నాపై కురిపింపనున్న యెల్లశుభములందును నీ ప్రేమాతిశయమును నేను గుర్తించునట్లు కటాక్షింపుము. అపవిత్రమయిన చింతను చింతించుటకుఁగాని, పరుషమయిన వచనమును వచించుటకుఁగాని, క్రూరమైన కార్యమును సలుపుటకుఁగాని నాకు బుద్ధి పొడమినప్పుడెల్ల త్వదీయ పవిత్ర దృష్టి నాపై ప్రసరింపఁజేయుము. వివిధములైన పనులఁ జేసిచేసి విసుగుఁ జెందియున్న వేళయందు నీ సహవాస మాధుర్యమును నా కనుగ్రహించి నన్ను ఉత్సాహవంతునిఁ జేయుము. అకార్యముల నొనర్చి నేను నిరాశచే క్రుంగిపోయియున్న సమయమునందు నాకు ధైర్యస్థైర్యముల ననుగ్రహింపుము. ఈ దినమునందు నాకు సంభవింపనున్న కష్టసుఖములును, జయాపజయములును నన్ను నీకు సమీపస్థునిఁగావించి సంపూర్ణముగా నీతో నేను ఐక్యమును పొందుటకు తోడ్పడునుగాక!

తెలవారెన్; కను చూడఁగల్గెఁ; నయినన్ దేవా! జగంబంతటన్
జలదచ్ఛన్న నభఃకుహూరజని చేవందం బటుల్, ముందు వె
న్కల నేమున్నది గానరాదు; నను నంధప్రాయు భద్రంబుగా
మెలగింపంగదె సాయమై యెపుడు; సామీ! భక్తచింతామణీ!

[వడ్డాది సుబ్బరాయకవి.]

---

ప్రభూ! ఎంత సుందరముగా నీవీ జగత్తును రచించితివి! స్వయముగా తూలికను చేఁబూని యెన్నివర్ణములతో దీనిని నీవు చిత్రించితివి. రూప, రస, గంధ, శబ్ద, స్పర్శముల మూలమున నిన్ను నీ వెన్నిమార్గముల నాకు ప్రకటించుకొనుచున్నావు! నిన్ను తెలిసికొనుటకై బాహ్యమున సుందరమైన జగత్తునెట్లు సృజించితివో, అట్టులే అంతరమునఁగూడ జ్ఞానప్రేమ పుణ్యభావముల నుదయింపఁజేసియున్నావు. ప్రభూ! జీవనదాతా! నిన్ను నేను బాహ్యాంతరములఁగనుగొని కృతార్థుఁడ నగుచున్నాను. వెలుపల నీ అపారసౌందర్యమును నే గాంచుచున్నాను. ఏ దిక్కునఁజూచినను ఉజ్జ్వలాక్షరములలో నీ స్వహస్తరచనయే కనిపించుచున్నది. నీ చిహ్నము లెల్లను, నీ నిదర్శనములెల్లను నెంతవిచిత్రముగా నెచ్చోటఁబెట్టినను గోచరమగుచున్నవి! ఓ హృదయనాథా! జీవనవల్లభా! నా జీవితమునందలి సుఖదుఃఖములలో నెల్ల నీ కారుణ్యలీలయే, నీ ప్రేమక్రీడయే తోచుచున్నది. ఈ నాక్షుద్రజీవితములోని, యీ మలిన జీవితములోని, ఒక్క ఘటనయు వృథాగా పోవుటలేదు. ఏపాటినవ్వుగాని, యేడ్పుగాని, సుఖముగాని దుఃఖముగాని సంభవించినను ఆ సకలమును నీ కారుణ్యముతో నిండినదై నీ ప్రేమకు నిదర్శనమై యొప్పుచున్నది. ఓ జీవనదేవతా! నీ ప్రేమలీలను గాంచి నేను స్తంభితుఁడ నగుచున్నాను. నీ చరణములకడనే పడియుందును. నీవు నా జీవన వల్లభుఁడవుకమ్ము. నిన్ను నేను దాసుఁడనై సేవింతును.

దాసుడ నంటి నీకృపకుఁ దద్దయుఁ బాత్రుడనంటి నేరముల్
సేసితి నంటి బంధములఁ జిక్కితి నంటి వివేకశూన్యతన్
గాసిలి యుంటి నన్ను దయఁజైకొని రక్షణసేయు మంటి నే
దోసిలిఁబట్టి యుంటి నిఁక దోసము లెన్నకు దీనరక్షకా!

---

# భక్తాంజలి

ఈశ్వరా! నీవు అద్భుతశక్తి సంపన్నుఁడవు. చిత్ర విచిత్రము లగు కార్యముల నెన్నిటినో యీ లోకమున జరుపుచున్నావు! నిరాధార మైన గగనప్రదేశమున నీవు అసంఖ్యాకములగు గ్రహనక్షత్రములను బొంగరములమాడ్కి గిర గిర త్రిప్పుచున్నావు. మహాసముద్ర మధ్యము నుండి నిప్పులు గ్రక్కు అగ్ని పర్వతములను పుట్టించుచున్నావు. మహో న్నత పర్వతములను తృటిలో నీవు జలధిగర్భములోనికి నీడ్చుకొని పోవుచున్నావు. మరుభూమిలో నీవు ఫలవృక్షముల మొలిపించుచున్నావు. నడివేసంగిలో నీవు కుంభవృష్టిని కురిపించుచున్నావు. బాహ్యజగత్తునందు వలె అంతర్జగత్తునందు నీవు విస్మయజనకములగు కార్యముల నెన్ని టినో సలుపుచున్నావు. మందమతుల నెందరినో అసాధారణ సామర్థ్య సమేతులనుగమార్చి వేయుదువు. కుశాగ్రబుద్ధుల నొక్కొక్కప్పు డెందులకు కొఱగానివారినిగ చేయుదువు. దయాలేశములేని రిని నీవు అపారదయా సహితుల గావించుదువు. పాపభూయిష్ఠులను పుణ్యాత్ములనుగ మార్చి వేయుదువు. చింతించినకొలఁది నీ శక్తినాకు అపరిమితాశ్చర్యమును గొలుపు చున్నది.

ఓయి మహానుభావ! వినవోయి, కృపారసవృష్టిఁ జిల్కవే
మోయి, దయాపయోధివి గదోయి, ననుం గరుణింప వేగరా
వోయి, యుపేక్ష నీకు తగదోయి, భవత్పద సేవకుండ నే
నోయి, పరాకు మానఁ గదవోయి, మహాత్మక! దీనరక్షకా!

---

# భక్తాంజలి

పుణ్యమూర్తీ! పుణ్యచింతలెన్నియో నీవు నా మనస్సులో కలిగించుచున్నావు. కాని అంత మాత్రముచేతనే నాకు చేకూరులాభమేమి? కలిగిన సచ్చింతలు కార్యరూపమును దాల్చినపుడు గదా హృదయమున కానందము. పక్వము గాకమునుపే గాలికి రాలిపోయెడు పసరుకాయలవలె నా డెందములో బయలుదేరెడు సద్భావములుగూడ కార్యములుగ మారక పూర్వమే ఐహికసుఖాభిలాషముందర నిలువఁజాలక అడగారిపోవుచున్నవి. దయాసింధూ! నా జీవితమును సంస్కరించి ఉన్నతము చేయఁజాలని యీ ఉత్తమభావములెల్ల నాకు ప్రక్కలోని బల్లెములై తీవ్రబాధను కలిగించుచున్నవి, ఆపద్బాంధవా! నే నీవేదనను సహింపఁజాలను. నే ననుసరింపఁజాలని యీ సచ్చింతల నీవు నాలోనేల జనింపఁజేయవలెను? జనింపఁజేసితివిపో వాని కనుగుణముగ జీవించుటకు నాకు శక్తినేల ప్రసాదింపవు? సర్వశక్తి సంపన్నుఁడవగు నీవు నన్ను పవిత్రునిఁ జేయఁజాలవా? నా కుటిలత్వమునుకూల్చి వేయఁజాలవా? దయాకరా! ఈ దీనుని కనికరించి రక్షింపుము.

నిను విడనాడనయ్య యిక నేరము లెన్నకుమయ్య దిక్కు నా
కనిశము నీవెయయ్య! భవదంఘ్రులఁ జూపఁగదయ్య దోసముల్
పెనగొని యున్నవయ్య! నెపమెన్నిన నోరువ నేరనయ్య! నా
మనవి వినంగదయ్య, యనుమానము దీరఁగ దీనరక్షకా!

---

# భక్తాంజలి

పరమ పావనా! నే నెట్లు నిన్ను సమీపింతును? ఎవ్విధమున నిన్ను ఆరాధింతును? ఏ మొగముపెట్టుకొని నిన్ను ప్రార్థింతును? నీ మాట తలపెట్టుటకు సయితము నిశ్చయముగా నా కెట్టి అర్హతయు లేదు. నేను పట్టి అయోగ్యుడను. పనికిమాలినవాడను! అడుగడుగునను నీ సదుపదేశమును పెడచెవినిబెట్టి స్వేచ్ఛానుసారముగ ప్రవర్తించి భ్రష్టుడనై పోయినవాడను. నా మనసును చూచుకొన్న నాకే లజ్జ వొడముచున్నది. ఎంత క్రోధము! ఎంత కామము! ఎంత లుబ్ధత్వము! ఎంత గర్వము! ఎంత స్వార్థపరత్వము! ఎంత డంబము! ఎంత దురాశ! ఇన్ని దుర్గుణములుగల నేను నీ పావన నామము నేపందమున స్మరింపగలను! కాని, దయాకరా! నీవు గాకున్న మతెవ్వరు ఈ పాపకూపమునుండి నన్నుద్ధరించి రక్షింపగలరు? అపార శక్తి సంపన్నుడవగు నీవు సాక్షిమాత్రముగాని కాప్రు మేమియుందువు? మోహ కలుషాత్ముడనగు నన్ను కరుణానిధీ! దయదలిర్చి యుద్ధరింపుము. పాపములు చేసి చేసి మొండివారిపోయిన నా మనస్సును సంస్కరింపుము. నీ సహవాససామీప్యమును గ్రహించి చరించెడు శుభబుద్ధిని నాకు ప్రసాదింపుము. తన్మాహాత్మ్య ప్రీతిచే సకల దుష్టవాంఛల నేను త్రుంచి వైతును గాక.

అతుల విచిత్రలోకముల నద్భుతరీతి సృజించి ప్రేమ నీ
ప్రతిభకు సన్నుతిగాను లోకభావము నేగా కరుణాపయోనిధీ!
మతి నిను నెంచినంతటనె మాని వెరన్ సుఖయించు నెంతొ యూష్
సతతము నీవె నాకు గతి సజ్జనజీవన లోకపావనా.

## భక్తాంజలి

పరాత్పరా! నీవు ఈ జగత్సంసారము నేల సృజించితివి? ఈ మహాకార్యమును తలపెట్టినన్ను నీ కొఱత యేదైన తీరకపోయెనా, నీ అపూర్ణత్వమేమైన పూర్తిగాకపోయెనా, నీ దుఃఖమెద్దియైన తొలగక పోయెనా? లేదా నీవు కాని మహాశక్తి యేదైనయొకటియుండి నిన్ను ఈ జ్ఞానకౌశలమయమైన బ్రహ్మాండమును సృష్టింప నొత్తిడి చేసెనా? సృష్టికి పూర్వమునందువలె నిపుడును నీవు జ్ఞానమునందు పరిపూర్ణుడవు, ఆనందమునందు పరిపూర్ణుడవు. అనంతశక్తికిని, అనంతప్రేమకును ఆధార భూతుఁడవు. నీ యీ జ్ఞానము, ఈ ఆనందము, ఈ శక్తి, ఈ ప్రేమయే గదా సృష్టికిహేతువు! పరమానందమున నీవు ఈ సంసారమును సృజించితివి, పరమానందమున నిప్పటికిని దానిని నీవు నడుపుచున్నావు. కవీంద్రా! ఎంతటి ఆనందానుభూతుఁడవై మనోహరరాగముతో ఈ సుందరగానమును నీవు పాడుచున్నావోగదా! ఓ చిత్రకరా! ఎట్టి ఉచ్చ భావోద్వేగమున నీ తూలిక యీ మనోహరచిత్తరువును చిత్రించెనో నాకు తెలియరాదు. ఎవ్వరి హస్తములలో నీవు నీ ప్రియకార్యమును సాధించు భారము నుంచెదవో వారి హృదయముల నీవు ఈ అసమానందముతో నింపి వేయుదువు. ఇందుచేతనే గదా వారు సకల దుఃఖవిపత్తులను తుచ్ఛముగనెంచి పరమానందముతో నీ జయగానమును జేయుచున్నారు! వారు నీ ప్రతిమూర్తులుగదా!

ఘోర విపన్నముద్రమునఁ గూలిన వారికి నీ కటాక్షమే
పారముఁ జేర్చునావకద! భక్త చకోరకపాళికన్నవా
పారణ పూర్ణచంద్రికయుఁ బాపవిమోచనధారయుఁ సదా
చారు కృపాసుధాసదన! సజ్జన జీవన! లోకపావనా!

---

•

# భక్తాంజలి

జ్ఞానదాతా! నీవు ప్రసాదింపకున్న నాకు జ్ఞానమెట్లు కలుగను!
నేర్చుము? సృష్టిలో నెంత జ్ఞానము గర్భితమైయున్నది? గగనమండల
ములో నెంతటిగంభీరజ్ఞానము! భూమండలములో నెంత భూరిజ్ఞానము!
అంతరిక్షములో నెట్టి అద్భుతజ్ఞానము! ఏ దిక్కున జూడఁబోయినను, ఏ
వస్తువులలోఁ జూడబోయినను విచిత్రజ్ఞానలీలయే. ఒజ్జవై నీవు బోధింప
కున్న నే నే జ్ఞానమైనను పొందఁగల్గియుందునా? సమస్తరహస్యములను
నీవే క్రమక్రమముగ నాకు కరతలామలకము చేయుచున్నావు. నీ సాహా
య్యవిశేషమున నే నెంతయో జ్ఞానసంపత్తిని గడింపఁగల్గితిని. సృష్టి
మర్మములనేగాక నేను మానవతత్త్వమునుగూడ నెఱుంగ గల్గుచున్నాను.
అన్నిఁటిని మించి పరమాత్మా! నిన్ను గుఱించిన విజ్ఞానమునుగూడ
నేను గ్రహింపగల్గినాను. కాని యెంతజ్ఞానమును పడయఁగల్గినను నేను
పొందిన జ్ఞానము అల్పముగను, పొందవలసినది అనంతముగను నున్నది.
నీ జ్ఞానమునకు మితిమేరలు గలవా? పరమగురూ! నన్ను జ్ఞానసంపన్నుని
జేసి ఆశీర్వదింపుము.

బాలురమయ్య మేము గుణపాఠము చెప్ప గురుండ వీవు నీ
పాలితమైన లోక మిది భవ్యతరంబగు పాఠశాల నీ
వేల భవత్ప్రబోధమున సిద్ధచరిత్రుల జేయుమయ్య రా
రా! లలిత ప్రభా కలిత! సజ్జన జీవన! లోకపావనా!

---

ఓ అనంతా! పూర్ణపరబ్రహ్మమా! అణువునందువలె బ్రహ్మాండము నందును పరిపూర్ణుఁడవై ప్రకాశించెదు నీవు 'నాది' యని నే చెప్పు కొనెడు ఈ ప్రాణబిందువునందు సయితము వ్యక్తమగుచున్నావు. అయి నను నీవు దేశకాలములచే నెంత మాత్రమును బద్ధుఁడవుగావు. ఇచ్చోట నున్నవాఁడవేయైనను దూరాతిదూరముననున్న నక్షత్రమునకు నావల సయితము నీ వున్నాఁడవు. వర్తమానముననున్న వాఁడవయ్యు అతిదూరస్థ మయిన గతమునందును భవిష్యత్తునందునుగూడ నీ వున్నాఁడవు. దేశ కాలములు నిన్ను తమలో నిముడ్చు కొనఁజాలవు. మానవుని చింతయు ఊహయు నిన్ను గ్రహింపఁజాలవు. ద్యులోకభూలోకములయందు నిండి యున్న నీ మహిమ యెంత అద్భుతావహము! అయినను నీ అనంతమహి మలోనిదియంతయు స్వల్పాంశమె. ఎంత అల్పుడనైనను నీ అనంత శక్తిచే నేను సంరక్షింపబడుచున్నాను. నీ అనంతజ్ఞానముచే నడుపఁబడు చున్నాను. నీ శాశ్వతబాహువులచే ఆలింగనము చేసికొనఁబడుచున్నాను. అనంతసంపత్తియగు నీ ఆనందమునకును, నీ పూర్ణత్వమునకును నేను వారసుఁడనై యున్నాడగదా!

ఆనందసుధానిధీ! నిన్ను ఎట్లు సంస్తుతింపవలయునో నాకు తోచకున్నది. ఆనందస్వరూపివై సమస్తవిశ్వమునందును నీవు వ్యాపించి యున్నావు. వ్యాప్తమైయుండుటయేగాక నీ స్వరూపమును నాకు ప్రకటించుచు నన్ను ఆనందరసాబ్ధిలో నోలలాడించుచున్నావు. అట్లు నీ దర్శనమును పొందకున్న నే నీ సంసారయాత్రను సాగింపగలనా? కృపాజలధీ! ప్రకృతిరాజ్యములోనేమి, మానవప్రపంచములోనేమి, యెక్కడఁ జూడఁబోయినను నీవు ఆనందమూర్తివై నాకు ప్రత్యక్షమగుచున్నావు. ఆహో! సూర్యోదయ సూర్యాస్తమయముల అనిర్వచనీయ రామణీయకతలో నీ ఆనందమేగదా! పూర్ణసుధాకరుని అప్రతిమానలావణ్యములో నీ ఆనందమేగదా! ఆకు జొంపములసొరులో, అలరుగుత్తుల కమ్మతావులలో నీ ఆనందమేగదా! ఫలజాతుల నానా రుచులలో, మందమారుతపు శీతలసంస్పర్శలో నీ ఆనందమేగదా! పసిబిడ్డల కిలికిలి పలుకులలో పక్షుల కల కలా రావములో, సెలయేళ్ల మర్మరధ్వనులలో, సముద్రగంభీరగర్జనములో నీ ఆనందమేగదా! ప్రేమపూరిత కార్యకలాపములోనెల్ల నీ ఆనందమేగదా! నీవు వ్యక్తపరుచు ఈ ఆనందలీలావిశేషముల నే కవికుమారులు వర్ణింపఁగలరు? ఏ చిత్రకారులు చిత్రింపఁగలరు? ఆనందస్వరూపా! ఇవిగో! కానుకలుగ నే సమర్పించు ఆనందాశ్రువులు స్వీకరింపుము.

సుందరరూప నీ సొగసు జూడఁగ జూడఁగ నాదుడెంద మా
నందరసాబ్ధిఁదేలి సుగుణాప్తి నభంగుర వైభవంబునన్
గందళితంబుఁగాంచెఁ బులకాంకుర పూరితమయ్యె మేను నీ
యందముచందమున్ గనిన నాత్మసుఖింపదె దీనరక్షకా.

---

# భక్తాంజలి

అమృతనికేతనమా! పరమేశ్వరా! నీ అనుగ్రహము లేక నే నెట్లు జీవింపఁగలను? స్వరూప పరిజ్ఞానమును గోల్పోయి దుఃఖభాజన మైన జీవనమును గడపుచున్న నేను కేవలము స్వశక్తిమూలముననే జ్ఞానోదయమును గాంచఁగలనా? జరారోగమరణ బాధితమగు ఈ శరీరమే 'నే' నని భ్రమపడుచున్నాను. ఎట్టిదుస్థ్సితి! అమృతస్వరూపా! నేను నీ బిడ్డను గానా? 'అమృతస్యపుత్రాః ' అని ఋషీశ్వరుఁడు సంబోధించి యుండ లేదా? కాని ఆ జ్ఞానము నాకేదీ? దయానిధీ! ఆ పరిజ్ఞానము నాకు దృఢ ముగ ప్రసాదింపుము. అస్థిరములగు శారీరికభోగముల యెడల నౌదాసీన్య మునువహించి సుస్థిరమగు ఆధ్యాత్మికసౌఖ్యముపట్ల శ్రద్ధనుబూని నేను అమృతత్వసిద్ధినిఁ బడయునట్లు కటాక్షింపుము.

---

# భక్తాంజలి

ఈశ్వరా! నీవు ప్రేమస్వరూపివి; మంగళవిధాతవు. అపార ప్రేమతో నీవు అనంతశుభములను నాకు కలుగఁజేయుచున్నావు. అయినను నా మానస మొక్కొకసమయమున నీ మంగళోద్దేశమును శంకించుచున్నది. ప్రపంచములోని విపత్తులును, దుఃఖములును, రోగములును, మరణములును నన్ను కొందలపరుచుచున్నవి. నా అల్పబుద్ధితో నీ కార్యముల రహస్యమును భేదింప ప్రయత్నించుచున్నాను. అది యెట్లు సాధ్యపడును? బుద్ధిమంతుఁడగు తండ్రియొక్క యుద్దేశములను లేఁబ్రాయుఁడగు తనయుఁడెట్లు పూర్తిగా గ్రహింపనేర్చును? స్వామీ! నేను నీ సమక్షమున పసిపాపఁడనుగానా? విపత్తులయొక్కయు రోగమరణాదులయొక్కయు మర్మమును నే నెటుల తెలిసికొనఁగలను? వీనిలో నీ మంగళహస్తమును గుర్తింపఁగల సూక్ష్మబుద్ధిని నాకు అనుగ్రహింపుము. శారీరిక, మానసిక, ఆధ్యాత్మికాభివృద్ధికి నివి యావశ్యకములన్న సంగతిని నాకు చక్కఁగా బోధపరుపుము. సంశయములచే నా విశ్వాసము చెదరిపోకుండునట్లు కటాక్షింపుము. నీ జ్ఞానకిరణప్రసారముచే గాజుముక్కవంటి నా చిత్తమును భాసమానముచేయుము. అపుడుగాని నీ చెయ్దముల తత్వమును గ్రహించి నేను శాంతమనస్కుఁడను కాఁజాలను. ఇదియే నా ప్రార్థన: ఆశీర్వదింపుము.

"నీవు దయామయుండ వని నిత్యము లోకము దెల్పుచుండగా
జీవుల కాపదల్ గలుగజేయుదు వన్న నదెట్లు సత్యమౌ
కావరమూని సంతతవికారగుణంబుల జెంది మానవుల్
కేవల పామరత్వమునఁగీడుల నొందరె దీనరక్షకా!

---

ఒక్కఁడవయ్యు బహుప్రకారముల విభాసితుఁడవై విచిత్రలీలల నీవు ప్రకాశించుచున్నావు. సమస్త విజ్ఞానశాస్త్రమును, సమస్త దర్శన శాస్త్రమును ఏకమేవాద్వితీయరూపుఁడవగు నిన్ను అన్వేషించుచున్నవి. మనుష్యుఁడు ద్వైతముతో సంతుష్టుఁడై యుండఁజాలఁడు. అతఁడు సకల విరోధములకును, సకలవైచిత్రములకును మూలమున సమన్వయసూత్ర మును గ్రహింపఁజూచును. నానాపరివర్తనముల మధ్య నీ వొక్కఁడవె అపరివర్తనీయుఁడవు. సకల వికారములమధ్య నీ వొక్కఁడవే నిర్వికారుఁ డవు. కాలబద్ధములగు సమస్త వస్తువులమధ్య నీ వొక్కఁడవే కాలా తీతుఁడవు. అనిత్యములలో నీవు నిత్యుఁడవు. నూతనములలో నీవు పురాతనుఁడవు. మృత్యువులో నీవు అమృతుఁడవు. వినాశములలో నీవు అవినాశివి. ఏ దిక్కునఁజూచినను కంటికగపడు విరుద్ధభావములకు నీవు సమన్వయకర్తవు. నీవు కేవలము నామరూపరహితమును, ఉపాధి హీనము, నిరవచ్ఛిన్నము నగుసత్తాగాదు. నీవు చైతన్యమయపురుషుఁ డవు. అందుచేతనే ఈ నామరూపములును, ఉపాధులును నీకు ప్రయో గింపఁదగియున్నవి. ప్రాకృతిక జగత్తునందలి ఉత్తాపములోను, వెలుతురు లోను, విద్యుచ్ఛక్తిలోను ఒక్కటేశక్తి యెట్లు ప్రకాశించుచున్నదో అట్టులే శీతము, గ్రీష్మము, ఆలోకము, అంధకారము మున్నగు పరివర్తనములకు మూలమందునను నీశక్తియె వెలుగుచున్నది. ఇఁక మానసిక జగత్తునందలి సుఖదుఃఖముల యొక్కయు, ఆశాభయములయొక్కయు, పాపపుణ్యముల యొక్కయు, ప్రేమద్వేషముల యొక్కయు మూలమునందును నీ మంగ ళేచ్ఛయే. ఉచ్చనీచములగూర్చియు, మంచిచెడుగుల గూర్చియు న్యాయ న్యాయముల గూర్చియు సత్యాసత్యముల గూర్చియు నేను చేసెడి చర్చలలోను నీవే ప్రకాశించుచున్నావు. నే నెప్పుడు దేశకాలాతీ

రాజ్యమున ప్రవేశింతునో అపుడు నా కెద్దియు పరిత్యాజ్యముగాదు; నింద్యమునుగాదు.

> "అకలంకంబగు శ్వేతవర్ణమొక టీ యామింటిపై వర్ణస
> ప్తకయుక్తంబగు నింద్రచాపమగు శేవనకా సర్వలోకైక నా
> యక! నీ వొక్కఁడవయ్యు నిండెదవు బ్రహ్మాండంబు నానాస్వరూ
> పకుఁడై యూర్ధ్వల మాస్థలంబునక దేవా గౌరాకృపాంబోనిధీ"

[చిలకమర్తి లక్ష్మీనరసింహకవి.]

---

# భక్తాంజలి

ప్రేమస్వరూపా! పరమేశ్వరా! నీ ప్రేమయెంతవిశాలము! ఎంత గంభీరము! ఎంత నిర్మలము! నీ ప్రేమ తత్వమునుగూర్చి చింతించిన కొలది నా కానందమును ఆశ్చర్యమును కలుగుచున్నవి. ఎన్నెన్నికోట్ల జీవరాసులపై నీవు ప్రేమదృష్టిని ప్రసరింపజేయుచున్నావు! అనంతమయిన యీ విశ్వములో నీ ప్రేమకు పాత్రముగాని ప్రాణి యొక్కటియునులేదు. సకలక్రిమికీటకాదులను, సమస్త పశుపక్షిజాలమును, సర్వమానవులను నీవు అపారప్రేమతో గాచుచున్నావు. అన్నింటి వృద్ధి వికాసములను నీవు కని పెట్టుచున్నావు. నీయాజ్ఞ జవదాటియెఱుంగని జంతుకోటినేగాక అడుగడుగునకు నీహితోపదేశముల నిర్లక్ష్యముచేసెడు నా బోటి దుష్టమానవులను గూడ నీవు కనికరించి కాపాడుచునే యున్నావు. నా ప్రేమ సంకుచితము, స్వార్థప్రేరితము, ప్రతి ఫలాశాసమన్వితము కాని నీ ప్రేమ యట్టిదిగాదు. నీవు నా యొద్ద కోరదగినదేమికలదు? ప్రతిప్రేమనుసయితము అపేక్షింపక నీవు నన్ను ప్రేమించుచున్నావు. నాకుగూడ నట్టిదొడ్డబుద్ధి నేల దయ చేయవు: ప్రేమించినపుడు ప్రేమించుటయేగాక నన్నుద్వేషించి హింసించి ననుగూడ పరులను ప్రేమించెడుబుద్ధి విశాలతను నా కనుగ్రహింపుము.

"ఆరయుగ నాదిమధ్యవిలయంబులు లేని మహాత్ము డెవ్వడో
ధరగల యెల్లజంతువులఁ దప్పకప్రోచు దయాళుఁ డెవ్వఁడో
పరమవిభూతిఁ బుణ్యజనపాళికి నిచ్చెడి దాతయెవ్వఁడో
నిరతము నమ్మహాత్ము మది నేము నుతింతుము భక్తియుక్తితోన్.

---

# భక్త్యాంజలి

ఓ పరమపవిత్రా! పరమేశ్వరా! నీవు నీపూర్ణపవిత్ర స్వరూపముతో నా హృదయములో ప్రకాశించి నా అహంకారమునెల్ల నణగ ద్రొక్కుచున్నావు. నా సత్యసంధతను చూచుకొని, నా సేవాపరాయణత్వమును చూచుకొని, నా జితేంద్రియత్వమును చూచుకొని. నా జ్ఞానసంపత్తిని చూచుకొని, నా వినయశీలతను చూచుకొని నాలో నేను సంతోషించుకొనుచు పొంగిపోవుచుండు సమయమున నేదోయొక పరీక్షమూలమున నా యథార్థస్థితిని నేను గ్రహించునట్లు చేయుచున్నావు, తగినశోధనము రానంతవఱకు నేనుపవిత్రుడనై యుండ గల్గుచునేయున్నాను. కాని బలవత్తరమైన శోధనమొకటి తటస్థింపగనే నామనస్సు పేముచువ్వవలె చివ్వన వంగిపోవుచున్నది. అపుడు నేనెంతదుర్బలుండనో స్పష్టముగతెలిసికొనగల్గుచున్నాను. నిజమునకు నా నైతికపటుత్వమేపాటిది? ప్రభూ! గర్వించుటకు నా కిసుమంతయేని హేతువుగలదా? నాల్గుబారలుపైకెక్కి కొండశిఖరము నధిరోహించినట్లు సంతోషించు కుఱ్ఱవానివలె నేనును నొక్కింత నీతిసంపత్తిని గడించినంతనే యెంతయో ఉబ్బిపోవుచున్నాను. కాని, అప్పుడప్పుడు త్వదీయపూర్ణ పుణ్యస్వరూపమును నాకు కనబరిచి నేనెంత అట్టడుగున పడియున్నాడనో, గమ్యస్థానమెంత దూరముననున్నదో నాకు వెల్లడించి నన్ను వినయ వినమ్రుని చేయుచున్నావు. స్వామీ! నేను బలహీనుడను; గర్వపూరితుడను; కనికరించి నన్ను ఉద్ధరింపుము.

ప్రాజ్ఞతలేదు నాయెడలఁ బ్రాజ్ఞుఁడ నేనను గర్వమెచ్చు నా
యజ్ఞతకన్న మేర నహి యాకలు చూడ ననంతముల్ త్వదీ
యాజ్ఞలరీతిఁ గాంచిన భయంబునఁ జిత్తము తత్తరిల్లు న
ప్రాజ్ఞుడనందు నన్ను సెడబాయక ప్రోవవె దీనరక్షకా !

ధర్మజ్యోతీ! పరబ్రహ్మమా! నీవు నా హృదయసదనమునందు వెలుగుచున్నావు. నీవే వివేకరూపమున నా లోపలనుండి ధర్మాధర్మ పరిజ్ఞానమును నాకు కలిగించుచున్నావు. నీవే మనస్సాక్షివై నా తప్పొప్పుల నెల్ల గ్రహించుచున్నావు. నీవే అంతర్వాణివై అధర్మపరిత్యాగమునకును ధర్మ నిర్వహణమునకు నన్ను సదా ప్రోత్సాహపఱుచుచున్నావు. కనులకు కనిపింపకనే నీవు నన్ను హెచ్చరించుచు ధర్మపథమున ముందుకు నడిపించుచున్నావు. ఒకప్పుడు ధర్మభీరుత్వమునకై నన్ను చీవాట్లుపెట్టుచున్నావు. మఱియొకప్పుడు ధర్మవీరత్వమునకై నన్ను కొనియాడుచున్నావు. ఒకప్పుడు నీవు నా హృదయమును దుఃఖసంతప్తము చేయుచున్నావు; మఱియొకప్పుడు ఆనందభరితముచేయుచున్నావు. ఇవ్విధమున నానామార్గముల నీవు నన్ను క్రమకమముగా ధర్మమునందు పెంపొందజేయుచున్నావు. ధర్మమూర్తీ! నీ శక్తిని నేనెంతగా నన్నుతింపగలను? ధర్మమునిమిత్తమై మనుజులెట్టికష్టముల ననుభవించుచున్నారు! ఎట్టి దుఃఖవేదనములు సహించుచున్నారు. ఆహా! నీ ప్రేరణమునకులోనై ధర్మనిర్వహణార్థము మానవులు తమప్రాణములనయితము బలిచేయుచున్నారుగదా! ధర్మస్వరూపా! నీ హెచ్చరికను పాటించి నేను సర్వదా ధర్మమార్గముననే చరించునట్లు కటాక్షింపుము.

ధర్మము నాచరింపుము. ధర్మముకంటె శ్రేష్ఠమైనది మఱియొద్దియు లేదు. ధర్మమెల్లరకును మధువువంటిది. * * * * బ్రాహ్మధర్మము.

---

# భక్తాంజలి

పూర్ణ పరబ్రహ్మమా! ఏమి నా మహాభాగ్యము! పూర్ణ స్వరూపముతో నీవు నా హృదయగగనమున వెలుగొందుచున్నావు. సాంతుడను చాంచల్యశీలుడను అపరిపూర్ణుడను అగు నాలో అనంతుడవును, నిశ్చలుడవును పరిపూర్ణుడవును అగు నీవు ప్రకాశించుట యేమి ఆశ్చర్యము! నీవు నీ స్వరూపప్రకటనముచే నెప్పటి కప్పటికి నూత్న నూత్న అభివృద్ధిమార్గముల ద్యోతకముచేయుచు నన్ను స్థిరముగా నెచ్చటను కూర్చుండనీయక ముందుకు నడిపించుచున్నావు. పూర్ణ జ్ఞానజ్యోతివై నీవు ప్రకాశించుచుండ నేను అల్పజ్ఞానముతో నెట్లు సంతుష్టిపడగలను? నీవు అపారప్రేమ జలధివై కనిపించుచుండ నేను సంకుచితప్రేమతో నెట్లు తృప్తినొందగలను? నీవు అనంత పుణ్యశీలుడవై భాసిల్లుచుండ నేను స్వల్ప పుణ్యకార్యములతో నెట్లు సంతోషింపగలను? నీవు నీ పూర్ణత్వముతో నా మనోనేత్రమెదుట సర్వదా ప్రకాశించుచు నన్ను మోహింపజేయుచు, నా డెందము హరించుచు నన్ను ముందడుగువేయ హెచ్చరించుచున్నావు. అజ్ఞుడనై, అశక్తుడనై, అధముడనై మృత్పిండమువలె పడియున్న నన్ను నీ వేరీతిగా ఉన్నత పథమున గొంపోవుదువో గదా! నేను నిన్నే నమ్మియున్నాను. రక్షింపుము.

---

ధర్మస్వరూపా! పరమేశ్వరా! సంసారమునంతయు నీవు ధర్మమయము గావించితివి. ఉదయమున నిద్రనుండి లేచినది మొదలుకొని రాత్రి పరుండ బోవువరకు నెన్నియో విధాయక కృత్యముల నిర్వహించునట్లు నీవు విధించియున్నావు. సమస్త ధర్మములకును నీవే ప్రేరేపకుఁడవు. ఎన్నియో కుటుంబ ధర్మములను, ఎన్నియో ఉద్యోగ ధర్మములను, ఎన్నియో మత ధర్మములను, ఎన్నియో సాంఘిక ధర్మములను, ఎన్నియో ప్రజాహిత ధర్మములను నియమించి నా యావజ్జీతమును నీవు ధర్మపాశ బద్ధముచేసి యున్నావు. ధర్మము నెరవేర్చినప్పుడు సంతోషమును, ధర్మము తప్పినపుడు దుఃఖమును నీవు నా కొసంగుచున్నావు. దయాసింధూ! నీ సాహాయ్య ప్రోత్సాహములు లేకున్న నేనెట్లు నా ధర్మముల చెల్లింపఁగల్గుదును? కష్టములకు వెరచి ధర్మముల నెగబెట్టజూచెడు నాకు ధైర్యస్థైర్యముల దయచేయుము. ధర్మముల మీఱుటచే సమకూడెడు ఐహిక సౌఖ్యములకంటె ధర్మమును పాటించుటచే తటస్థించెడు ఇక్కట్టులనే నేను శ్రేయోదాయకములుగ భావించి, వానిని సంతోషముతో స్వీకరించు శుభబుద్ధిని నా కనుగ్రహింపుము. ధర్మసౌందర్యముచే సర్వదా యాకర్షింప బడినవాడనై నేను స్వధర్మ నిర్వహణముఁగావించి ధన్యాత్ముఁడనగుదును గాక!

---

# భక్తాంజలి

పతితపావనా! నీవు సార్థక బిరుదాంకితుఁడవుగావా? అగుచో నన్నేల నీవు పవిత్రునిఁగావింపవు? పాపకూపమునఁ బడి కన్నుఁగానక లేవఁజాలక కొట్టుకొనుచున్న నన్ను నీవేల యుద్ధరింపవు? నీ దయను పొందుటకు నేను అర్హుఁడనుగానా? నాబోటి కలుషాత్ముఁడుగాకున్న మఱెవ్వరు నీ కనికరమునకు పాత్రులు కాఁగలరు? దయామయా! నీ కరుణాకటాక్ష వీక్షణముల నాపయి నొకింత ప్రసరింపఁజేయుము. చీడపురుగు ఆకును తినివేసినట్లు పాపము నా మనస్సును పూర్తిగా తినివేసినది. నా హృదయము కళావిహీనమయి నిర్జీవమై దుర్బలమయి క్రుంగిపోయియున్నది. దయాసింధూ! నీ కెన్నడు నాపయి కనికరము కలుగునోయని నిరీక్షించుచున్నాను. అవంతశక్తి సంపన్నుడవగు నీకు నన్ను బాగుచేయుట అసాధ్యమగు కార్యమా? లేశమాత్రము నీవు సాహాయ్యము చేసితివేని నేను పైకి రాగలను. నాకంటెను పాపపంకిలమున కూరుకొని పోయినవారిని నీవు లేవనెత్తియుండలేదా? లేవనెత్తుటయేగాదు, వారిని పరమభక్తులనుగా నీవు మార్చివేసి యుండలేదా? దయాకరా! ఈ దీనుని కనికరించి రక్షింపుము. నీ బిరుదమును సార్థకము చేసికొనుము.

పతితుఁడ నేను నీ వమిత పావనమూర్తివి సర్వదుర్గుణా
న్వితుఁడను నేను నీ వతుల నిర్మలసద్గుణ సంయుతుండ వే
నతికఠినుండ నీ వతిదయాగుణశాలివి కావ నన్ను నే
గతిఁ గరుణింతువో యరసి కన్గొనవే కృప దీనరక్షకా!

పితా! నా హృదయములోని గభీరమయిన అభావమును నీ వెలుంగు దువు. నాకు కాలూని నిలువఁగల స్థిరభూమి యెందుఁగలదు? నేటికిని నేను నానావిధ సందేహములతోడనే, పలువిధములైన ఊహలతోడనే దినములను గడపుచున్నాను. నీతోడి ఐక్యమే నాకు కావలసినది. ఇదియే నా ప్రార్థన. ఇది సిద్ధించునా? కల్పనతో నేను సంతుష్టుఁడనై యుండఁజాలను. కల్పనా మూలమున నే నితరులను మోసపుచ్చఁజాలను. నీవు సత్యమనియు, నీవు నిత్యమనియు నేను గ్రహింపఁగోరుచున్నాను. తత్పరిచయమును నేను పొంద నభిలషించుచున్నాను. సత్యమును, శాశ్వతమును, పరిపూర్ణమునగు నో పరబ్రహ్మమా! నీ దర్శనమును నాకు ప్రసాదింపుము. నీ ప్రకాశములో నన్ను ముంచివేయుము. ఇతరులు నన్ను సాధకుఁడనుచుందురు, భక్తుఁడనుచుందురు. అట్టి యోగ్యత నాకేదీ? అయినను పరులచే సాధకుఁడనియు భక్తుఁడనియు సమ్మానింపఁబడుచునే యున్నాను. పితా! నా కొకింత స్థిరభూమి కావలసియున్నది. నా హృదయములోని యీ క్షుదార్తి తీరవలసియున్నది. నీ తోడి ఐక్యానుసంధానమె నా వాంఛితము. ఇదియె నా ప్రార్థన.

# భక్త్యాంజలి

సర్వసాక్షీ! పరమేశ్వరా! నేను నీకు నుడువవలసినదేమున్నది? సమస్తమును నీవు తెలిసికొనుచునే యున్నావు. నా చేయుకార్యములను నీవు వీక్షించుచున్నావు. నా వచించు వాక్కులను నీవు ఆలకించుచున్నావు. నా మనస్సులో సంచారముచేయు తలంపులనెల్ల నీవు గ్రహించుచున్నావు. నేను అనుభవించు సుఖముల నీ వెఱుంగుచున్నావు. నా హృదయములోని వేదనమును నీవు గమనించుచున్నావు. నా పుణ్యములను నా పాపములను నీవు గుర్తించుచున్నావు. ఇక నేను చేయవలసిన ప్రార్థన మేమున్నది? సుఖముగాని కష్టముగాని, సంతోషముగాని దుఃఖముగాని, భూషణముగాని దూషణముగాని—ఏదైననుసరే నీకు తెలియక నాకు తటస్థించుటలేదు. దుర్లంఘ్యమగు నీ శాసనానుసారముగా సకలకార్యములును లోకములో జరుగుచున్నవి. నీ యిచ్ఛనెఱింగి శాంతముగ ప్రవర్తించెడు మనఃస్థైర్యమును నాకు ప్రసాదింపుము. తాత్కాలికముగ నాదెంద మెంత పరితప్తమైనను నీవు నాకు శుభమునేగాని అశుభము నెన్నఁడు చేయవు గదా! ఇక నేను తల్లడిల్లనేల? నీ మంగళోద్దేశమునందు దృఢమయిన నమ్మకముంచి నేను నిబ్బరముగా నుందునట్లు కటాక్షింపుము. ఎట్టి కష్టములైనకలుగనీ, ఎట్టి నష్టములైన సంప్రాప్తింపనీ ఈషన్మాత్రమయిన నేను ధర్మపథమునుండి తొలగకుందునట్లు నాకు సద్బుద్ధి ననుగ్రహింపుము. రక్షింపుము. ఆశీర్వదింపుము.

శాంతి సుధాకరా! రమ్ము. నీకొరకై నా హృదయము ప్రతీక్షించుచున్నది. ఎంత సంక్షోభము! ఎంత వేదన! ఎంత పరితాపము! నీవు గాకున్న మఱియెవ్వరు నా యీ మనోవ్యధను తీర్పఁగలరు? మానవమాత్రులు నా బాధను గ్రహింపఁజాలరు. నా మనస్సును చూడఁజాలరు. నిన్ను అడ్డుపెట్టఁగల కవాటమెద్దియు నా హృదయసదనమునకు లేదు గదా! ధారాళముగా నీవు లోన ప్రవేశింపఁగలవు. సర్వమును నీవు స్పష్టముగా వీక్షింపఁగలవు. నా మనోవేదనమునకు కారణములను నీవు తెలిసికొనఁగలవు. అందులకనియే నీ శరణుఁ జొచ్చినాడను. నాహృదయముపై శాంతిసుధను చిలుకరింపుము. నా పరితాపాగ్నిని చల్లార్పుము, నా మానసమును సరియైన త్రోవను నడిపింపుము. సకల విషయములలోను నీ యిచ్ఛను పరిపాలించునట్లు నా బుద్ధిని ప్రేరేపింపుము. లోకప్రీతికొఱకుఁగాని, స్వసుఖము కొఱకుఁగాని ధర్మమును త్యజింపకుండునట్టి మనోనిశ్చయమును నాకు దయచేయుము. ఆశీర్వదింపుము.

జగద్విధాతా! సకలప్రపంచమును నడపువాఁడవు నీవు. నీ యిష్టములేక విశ్వములో నొక్క కార్యమయినను జరుగనేరదు. ఈ విషయము నెఱిఁగి యున్నను, నీ యిచ్ఛయే నాకు మంగళప్రదమని తెలిసియున్ననుగూడ నీ యిష్టమునకు లోఁబడి ప్రవర్తించుటకు నా మానసము ఒక్కవెట్టున సమ్మతింపదు గదా! ఏమి అభాగ్యము! సర్వజ్ఞుఁడవును, సర్వశక్తిమంతుఁడవును, సర్వజీవదయాపరుఁడవునైన నీకు నా జీవనభారము నొప్పగించుట కన్న యుక్తమయినపని మఱియేమియుండును? నీ యిచ్ఛయే నెరవేరుగాక యని యెంచి, కష్టమునందును, సుఖమునందును, దుఃఖమునందును, సంతోషమునందును సమబుద్ధితో మెలంగెడు హృదయపరిపక్వతను నాకు దయచేయుము. నీకు విధేయుఁడనై జీవించినపుడే నా మానసమునకు శాంతికలుగునుగాని అన్యథాయెట్లు కలుగనేర్చును? దయామయా! సకలవిధాయుడవగు నీకు సంతోషముతో లోఁబడెడు సద్బుద్ధిని నాకు దయచేయుము. నీ శుభోద్దేశమునందు పూర్ణవిశ్వాసమునుంచి నేను విశ్రం హృదయుఁడనై నా జీవయాత్రను జరుపుకొందునుగాక! ఆశీర్వదింపుము.

అడుగకమున్నె సాధనములన్ని యశేచ్ఛనొసంగి మాకు నీ
పుడమిని ధారవోసి సమబుద్ధి స్వతంత్రతలెల్లనిచ్చి మా
దుడుకులకోర్చి యెల్లప్పుడు తోడును నీడయు నౌచు నుందు నీ
యడుగులఁజేరుమన్న భయమందుచు చిత్తము దీనరక్షకా!

# భక్తాంజలి

ఓ పరమాత్మా! నీ మహిమ నెట్లు నేను వర్ణింతును? ఎచ్చట నారంభింతును, ఎచ్చట పూర్తిసేతును? నాకు నీ ఆదియు తోఁచుట లేదు, అంతమును తోఁచుటలేదు. కాని నే నీ పృధివిలోఁగడపు దినములు పూర్తి కావచ్చిన కొలఁది నీవు నా హృదయములో విశేషరూపమున ప్రకాశించుచున్నటుల నాకు గోచరమగుచున్నది. ఇపుడు నా నల్లని వెండ్రుకలు తెల్లనివిగ మాఱిపోయినవి. నా రెండు నేత్రములును నిస్తేజములయినవి; శరీరమును నానాట క్షీణించుచున్నది. కాని నీ కరుణమాత్రము తగ్గిపోవుట లేదు. ఇపుడు నీ కారుణ్యము నా యంతరములో ప్రవేశించి నూతన బలముతోడను, నూతన స్ఫూర్తితోడను ఆత్మను తేజస్వంతము చేయుచున్నది. నీ ఆనందధామమునకు నన్ను తీసికొనిపొమ్ము. ఇపుడు నాకిక నేమియు నక్కఱలేదు. కేవలము నీవే నాకు కావలయును. ఇచ్చట నిందాస్తోత్రములును, శోక దుఃఖములును తీవ్రరూపమున నన్ను ప్రపంచవిముఖుని చేయుచున్నవి. నీవే నా రక్షకుఁడవు. నీవు సమస్త బ్రహ్మాండము యొక్క భారమును వహించుచున్నావు. నా యీ అల్పహృదయ భారమును నీవు వహింపఁజాలవా? నీలోనే నా ఆశ, నా నిబ్బరము. నీవు నా పమీపమున నున్నచో దుఃఖవిపత్తులెవ్వియు నన్ను తాకఁజాలవు. నీవు దగ్గరలేకున్న కుశాంకురిము సయితము అంకుశమువలె నన్ను బాధింప సాగును. పరమాత్మా! ఈ సంసారమునందలి మోహ కోలాహములచే ప్రపీడితుఁడనై నేను నీ శరణుఁజొచ్చుచున్నాను. నీ ఆనందధామమునకు నా ఆత్మను ఉపయుక్తము గావింపుము.

# భక్తాంజలి

ప్రభూ! పరమేశ్వరా! నీవు నా లోపలను వెలుపలను నిండియున్నావు. ఎవని చేతిక్రింద నేను పనిచేయుచున్నానో ఆ యజమానిద్వారా నీవే నానుండి నిష్కపటమైన సేవను గ్రహించుచున్నావు. నేను చేయఁబోవుచున్న పనిలో నీ సాన్నిధ్యమును నే ననుభవించునట్లు కటాక్షింపుము. నన్ను సర్వదా కనిపెట్టుచు నాకు మంచిబుద్ధిని ప్రసాదించుచుండుము. నిరుత్సాహపడకుండునట్లు నా కెల్లపుడును హెచ్చరికను గలుగఁజేయుము. నాశక్తి సన్నగిల్లిపోయినపుడును నా ఓర్పు ఉడిగిపోయినపుడును నీ సంస్పర్శచే నన్ను ధైర్యవంతునిఁగను సహిష్ణునిగను జేయుము. చేయవలసినపనినె నిర్లక్ష్యముగాఁ జేయుటకుఁగాని మానివేయుటకుఁగాని నాకు దుర్బుద్ధిగలిగిన సమయములందు సర్వసాక్షివైన నిన్ను నేను జ్ఞప్తిచేసికొని అప్రమత్తుఁడనై నేను నా ధర్మమును నిర్వహించెదనుగాక! నా కార్యసంబంధమును బట్టి నే నీదినమున నెవ్వరెవ్వరిని కలసికొందునో వారినందరిని ప్రేమతోడను గౌరవముతోడను చూచునట్లు నన్ననుగ్రహింపుము. స్వార్థచింతనుండియు దురాశనుండియు మానవ స్తోత్రప్రియత్వమునుండియు నన్ను తప్పించి నేఁగావించెడు సకల కార్యములలోను నీ మహిమనే గాంచునట్లు కరుణింపుము. నీనుండి నన్ను దూరముచేయుటకు మారుగా నాఁజేయు సమస్త కార్యములును నన్ను నీకు మరింత సమీపస్థునిగఁజేసి నీతో నేను నిరంతర సంయోగము పొందుటకు తోడ్పడునుగాక.

[తత్వభూషణుడు]

---

# భక్తాంజలి

ఆనందసింధూ! అది యేలనో నీవు నిష్క్రియుఁడవని, నిరానందుఁడవని కొందఱు చెప్పుచుందురు. కాని నాకు మాత్రము నీవు నిరంతర క్రియాశీలుఁడవుగను ఆనందసాగరుఁడవుగను తోఁచుచున్నావు. నీ సృష్టికి మేర లేదు. నీ ఆనందమునకును మేరలేదు. ఉద్భిజ్జగత్తులో నెట్టి నవనవసృష్టి! ప్రాణి జగత్తులోనెట్టి చిత్రవిచిత్రసృష్టి! మానవజగత్తులోనెట్టి పరమాద్భుత సృష్టి. క్షణక్షణమును నీవు సృష్టిచేయుచునేయున్నావు. సృష్టిలో నీ ఆనందము. నీ ఆనందములో సృష్టి. జలమును, స్థలమును, ఆకాశమును నీవు జీవరాసులతో నింపివేయుచున్నావు. నింపివేయుచు నీవు నిరంతరానందములో నిమగ్నుఁడవై యున్నావు. నీవు సృష్టింపఁగలవు; సంరక్షింపఁగలవు; సంహరింపఁగలవు. నీవు సర్వసమర్థుఁడవు. అందుచేతనే నీకు భయములేదు. విచారములేదు, అవిరళానందమే నీ సృష్టితత్వమని గ్రహించి, నీ ఆనందములో పాల్గొనెడు అధికారమును ప్రసాదించి నన్ను ఆశీర్వదింపుము.

---

ప్రాణస్వరూపా! పరమేశ్వరా! నీవు నా ప్రాణమునకు ప్రాణము. దయతో నీవు నా శరీరమునకు బలమును ఆరోగ్యమును అనుగ్రహించితివి. అందులకై నీకు నా కృతజ్ఞతాపూర్వక ప్రణామము లాచరించుచున్నాను. దయామయా! ఇట్టి స్వాస్థ్యము ననుభవించుచు అలసత్వమునందు నేను దినములు గడపకుందును గాక! సూర్యచంద్రులును, నక్షత్రములును, జలమును, వాయువును నీచే కల్పింపఁబడిన సమస్త ఆహార పదార్థములును ఇంతేల, సకల జగత్తును నాకు సేవను సలుపుచున్నవి. ప్రభూ! కృతఘ్నుఁడనై నిన్ను నేను మఱవకుందును గాక! నీవేరీతిగా నన్ను ఒక క్షణమైనను మఱచియుండుట లేదో అదేతీరున నేనును నిన్ను మఱవకుందును గాక! నీ దాస్యభాగ్యమును నాకు దయచేయుము. నీ కార్యాచరణమునందే నా జన్మమును గడపుదును గాక! ఈ నా మనోరథము సిద్ధింపఁజేయుము.

---

దయామయా! రోగముయొక్క తీవ్రబాధ దుస్సహముగ నున్నది. దీర్ఘ కాలము సేవచేసి నా బంధువులు నా బాధలో నిక సానుభూతిని చూపజాల కున్నారు. ఈ సమయమందు నీ వొక్కడవే నాకు సహాయుడవు: శాంతి దాతవు. ప్రభూ! నీకు నమస్కారములు. ఈ తరుణమునందు నీ కారుణ్య మునుగూర్చి నాకు అవిశ్వాసము కలుగనీయకుము. ఈ ఘోరకష్టసమయ మునందు, 'దీనబంధూ!' 'దయాళూ!' అనుచు నీ వైపునకు నా బాహువు లను చాచుచున్నాను. ప్రభూ! నీ నియమోల్లంఘనముచే తటస్థించిన శిక్షను విశ్వాసపూర్ణహృదయముతోను ఆనందముతోను సహించెదనుగాక! ఘోర విపత్తున తగుల్కొనియున్నను నిన్ను, దయామయా! అనియేయందును, దయాళూ! ప్రభూ! నీ యిచ్ఛయే నెరవేరుగాక! నీవు ధన్యుడవు: ధన్యుడవు. శిరమువంచి నేను నీకు నమస్కారము చేయుచున్నాను.

---

విచిత్ర విధాతా! సకలభేదములకును నీవే కారకుడవు. ఐశ్వర్యమువలె నా యీ పేదఱికముగూడ నీ వరదానమే. నీ వనుగ్రహించినది కీడెట్లు కానేర్చును? ధనముమీద నాకుఁగల మోహమును వినాశముచేయుము. ఎంత వెఱ్ఱివాఁడను! ధనికుల అహంకారమును ధనికుల దుష్ప్రవర్తనమును కన్నులార చూచుచుండియు నేసింకను ధనమునే ఆశించుచున్నాను గదా! స్వామీ! నాభ్రమను తొలగింపుము పేదఱికములోని మాధుర్యమును గ్రహించెడు నిర్మలబుద్ధిని నాకు దయచేయుము. మహనీయులెందరు దారిద్ర్యమును వ్రతముగ పరిగ్రహించియుండిరి? ఎందరు రాజ్యవైభవమును సయితము తృణప్రాయముగ త్యజించి భిక్షపాత్రను స్వీకరింపలేదు? దయాసింధూ! నా పేదఱికము నాకెంత మేలొనఁగూర్చెను? పేదతనమే నిన్ను నా కత్యంత సమీపస్థుని చేసినది: పేదతనము మూలముననేగదా నీ స్మరణయు, విశ్వాసమును నాకు సులభసాధ్యములయినవి! కష్టసహనమును, వినయమును, సానుభూతిని ఈ పేదఱికమేగదా నాకు నేర్పినది! నీ సాన్నిధ్య భాగ్యమునకంటె నాకు లోకములో కావలసినదేమి యున్నది? ఏ విధి లేకపోయినను సరే నీ సన్నిధిని మాత్రము తమ కనుగ్రహింపుమని భక్తులు గానముచేసి యుండలేదా? నా మనస్సును నీమీద నిశ్చలముగ నిలిపియుంచునటుల బుద్ధినొసంగుము. ధనములో పేదనైనను భక్తిలోమాత్రము పేదనుజేయకుము. నిరంతరము ఆధ్యాత్మికాభివృద్ధిని గాంచునట్లు నన్ను కటాక్షింపుము.

# భక్తాంజలి

ఐశ్వర్యదాతా! నాకుగల సమస్తైశ్వర్యము నీ ప్రసాదమే. ఈ వస్త్ర వాహనములు, ఈ మందిరారామములు, ఈ ఉద్యోగాధికారములు, ఈ భార్యా పుత్రాదులు, ఈ దాసదాసీజనములు, ఈ సుఖసౌభాగ్యములు, ఈ వైభవములెల్ల నీ యనుగ్రహమే! వీనివి పొందుటకు నాకుగల యోగ్యతయేమి? నాతోఁబాటు పుట్టిపెరిగిన అసంఖ్యాకజనులకు లేవిసంపత్తి వాకేలకలుగ వలెను? ఇందులకుహేతువు నేనేమియు చెప్పజాలను. ఐశ్వర్యప్రాప్తికి కొందరు పూర్వజన్మసుకృతము కారణమని చెప్పుదురు. మరికొందఱు బుద్ధివిశేషత్వమె హేతువనియందురు. కాని నాకీహేతువులు తృప్తి కలిగించుటలేదు. నే నెఱిగినది నీ అవ్యాజకరుణయొక్కటియే. అదియే నా యీ సంపదకెల్ల మూలకారణమని నే నెంచుచున్నాను. ఇక వీనివి చూచుకొని నేనెట్లు గర్వపడగలను? వాస్తవమునకు ఈ భాగ్యమంతయు నీది గాని నాదిగాదు. స్వామీ! ఈ వస్తుచయములో దేని నెవ్విధమున వినియోగింపవలయునో నాకు నేర్పుము. నా మనస్సులో నేమూలనైన అహంకారము దాగియున్న దానినిపూర్తిగ పెరికివేయుము. నీ విచ్చినవానికై నే గర్వించుటా! ఎంత అపరాధము! సమస్తసంపత్తిని త్వదీయఇచ్ఛానుగుణముగా వినియోగించి నేను ధన్యుడనగుదునుగాక!

---

# భక్త్యాంజలి

పరమాత్మా! ఎంతకాలము నేను అంధకారములో తడవులాడుదును? ఎంతకాలము సంశయములతో పెనగులాడుదును? ఏ గ్రంథములు నా సందేహములను తీర్పఁగలవు? ఏ మహాత్ములు నాకు దివ్యజ్యోతిని ప్రసాదింపఁగలరు? ఏ వేవియో ఉపాయములకై నేను దేవులాడనేల? ఒక్కసారి నీవు నాయెదుట ప్రకాశించిన నా సమస్తానుమానములును విచ్ఛిన్నములు గావా? నాకు నూతన జ్ఞానోదయముగాదా? పరబ్రహ్మమా! నీవుగాకున్న మఱి యెవ్వరు నిన్నుగుఱించి స్పష్టమయిన జ్ఞానమును నాకొసంగఁగలరు? నీ స్వరూపమెట్టిదో నిన్నెవ్విధమున నేను పొందగలనో ఒక్కమాఱు బోధింపవా? చదివి చదివి, విని విని, చూచి చూచి మనస్సు విసిగివేసారి పోవుచున్నది. హృదయము నీకొఱకై పరితపించుచున్నది. నీకు కరుణ కలుగదాయె. ఏమిచేతును? నీ దర్శనమును పడయనిది నా చిత్తమునకు సుఖములేదు; నా హృదయమున కానందములేదు. నా మనస్సునకు హాయిలేదు. నీవు స్వప్రకాశుఁడవుగదా; స్వామీ! ప్రకాశింపుము. నాకు జన్మసాఫల్యమార్గమును కనఁబఱుపుము; ఆశీర్వదింపుము.

ఆ విరా వర్గ ఏధి! రుద్ర!
యత్తే దక్షిణముఖం
తేన మాం పాహి నిత్యమ్.

## భక్తాంజలి

జగదీశ్వరా! నీకు మా హృదయపూర్వక నమస్కారములు. మహోత్కృష్టములయిన సత్యములను నీవు మాకెరింగించితివిగదా యని గర్వించుచున్నామేగాని సత్యపరిజ్ఞానముతోబాటు మాకు సంక్రమించెడు బాధ్యతను మేము గుర్తించుటలేదు. తెలిసిన సత్యమును అనుష్ఠింపమేని, దానిని దశదిశల ప్రచారముచేయమేని సత్యమునుగ్రహించి ప్రయోజనమేమి? మూకుడు క్రింద మూసిపెట్టుటకా సత్యజ్యోతిని నీవు మాకు ప్రసాదించినది? దయాకరా! మా బాధ్యతను మేము గ్రహించునట్లు చేయుము. నీ వెంతయో ప్రేమతో ననుగ్రహించిన సత్యమును జగజ్జనులకెల్ల ప్రకటించుటకు తగిన బుద్ధిని, సామర్థ్యమును మాకు దయచేయుము. మమ్ముచుట్టుకొన్న అలసత్వమును ఉపేక్షాభావమును పారద్రోలుము. సత్యధర్మప్రచారమునకై యెట్టిత్యాగమునైనను సంతోషపూర్వకముగా గావించునట్లు మా మనస్సుల నాయత్తముచేయుము. సత్యముకొఱకై ప్రాణములను సయితము తృణప్రాయముగ నాహుతిచేసిన ధర్మవీరుల ఉజ్జ్వలచారిత్రముల మా హృదయమెదుట ప్రదర్శించుచుండుము. సత్యగ్రహణ సమర్థమయినబుద్ధిని ప్రసాదించిన నీవు దానిని ప్రచారముచేయుటకు తగిన యోగ్యతను గూడ మాకొసంగవా? హీనమానసులమగు మమ్ము కనికరించి రక్షింపుము.

---

పరమమిత్రమా! నీ సహవాసములో నెట్టి మాధుర్యమున్నది! ఎట్టి ఆనందమున్నది! ఎట్టి తన్మయత్వమున్నది! నీ చెంగటఁజేరి నిన్ను స్మరించునపుడు, నీ మధురాలాపముల నాలకించునపుడు గంటలు నిమిషములై, నిమిషములు క్షణములై పరుగెత్తిపోవుచున్నవి గదా, ఇంచుకసేపు నీ సహవాసభాగ్యము ననుభవింపగనే, ఆత్మకెంతబలము, హృదయమున కెంత యుల్లాసము! ఎక్కుడుకాలము నీ చెలిమికలిమి ననుభవింపక పోవుటచేతనే నా జీవనము నిర్జీవమై, నిస్సారమై నిరర్థకమగుచున్నది. నీ మైత్రిలోఁగల మహిమ నెఱిఁగియుండియు, నేను తగినంతకాలము నీ కొఱకై వినియోగింపఁ జాలకున్నాఁడను. చేతిక్రింద పెన్నిధినిఁబెట్టుకొని కూటికిపేదయై అల్లాడు నభాగ్యునివలె సకలసౌభాగ్య సంధాయకుఁడవగు నిన్ను చెంతనే యుంచుకొనియు, నీ సహవాసమును నిర్లక్ష్యముచేసి నేను దుఃఖసంతప్త జీవమును గడపుచున్నాను. అనుంగు మిత్రమా! నీవేల నామౌఢ్యాంధకారమును చిమ్మివేయవు? నీ స్నేహలాభమును పొంది నిష్పాపుఁడనై, నిర్విచారుఁడనై నేను నిరంతరానందము ననుభవించునట్లు నీవేల నాకు తోడ్పడవు? సఖా! రమ్ము! నా హృదయ దోలికపై నాసీనుఁడవుకమ్ము.

# భక్తాంజలి

జగదీశ్వరా! దేశకాలబద్ధుఁడను, పరిమిత బుద్ధిసమేతుఁడనైన నేను, దేశకాలా తీతుఁడవును, అనంతశక్తి సంపన్నుఁడవునైన నీకు సరియైన పేరు నెట్లు పెట్టగలను? నా యూహ నెంతదూరము పోనిచ్చినను పరిమితార్థ బోధకములగు నామములే నాకు స్ఫురింపఁగల్గునుగాని అపరిమితుఁడవగు నీకు తగియుండుపేరు లెవ్విధమున స్ఫురింపనేర్చును? అనేక సంబంధములను నాతో కల్పించుకొని చిత్ర విచిత్రలీలల నీవీ సంసారమునందు ప్రవర్తిల్లుచున్నావు. ఒకప్పుడు జన్మదాతవగు తండ్రివిగ, ఒకసారి ప్రేమించిపెంచెడు తల్లివిగ, ఒకసారి హితోపదేశముకావించెడు మిత్రుఁడవుగ, ఒకతూరి సుజ్ఞానము నొసంగు గురుఁడవుగ, ఒక వేళ ధర్మబోధ సలుపు ఆచార్యుఁడవుగ, ఒకతరి వ్యాధినివారణము సేయుభిషగ్వరుఁడవుగ, ఒక తరుణమున వలపుఁగొలుపు ప్రియుఁడవుగ, ఒక సమయమున పాలించు ప్రభుఁడవుగ నీవు నాకు తోఁచుచున్నావు. సంఘమునందు నే ననుభవించు సకల సంబంధ బాంధవ్యములును నీయందు వేయిమడుంగు లధిక మాధుర్యముతో నలరారుచున్నవి. పరమపురుషా! నిన్నుఁబట్టియే సర్వ బాంధవ్యములును ప్రియతమములగుచున్నవి. ఎల్ల సంబంధములలోను నిన్నే దర్శించుచు నేను ధన్యుఁడనయ్యెదను గాక!

తల్లివి తండ్రివిన్ దొరవు దాతవు [illegible]
జల్లని వాడవున్ ప్రియము జ[illegible]డవు తోడు నీడవు
సల్లలిత ప్రభావుఁడవు చక్క[illegible]ప్రోడవు నా[illegible]నంబు రం
జిల్లఁగఁ జేయువాఁడవని చే[illegible]ఁ గూరిమి దీనరక్షకా!



# భక్తాంజలి

ధర్మస్వరూపా! నీవు నిరంతరము ధర్మ సంస్థాపనమునకై కృషిచేయుచున్నావు. యుగయుగములందును నూత్న నూత్నమార్గముల ప్రపంచములో ధర్మమును ప్రకాశింప జేయుచున్నవాఁడవు నీవే. మహాత్ముల మూలమున మానవజాతిలో ధర్మప్రచారము కావించుచున్నవాఁడవు నీవే. అమ్మహాపురుషులు బోధించు నవీనసత్యములను స్వీకరింప ప్రజానీకమును పురికొల్పువాఁడవు నీవే. సత్యము నిమిత్తము సర్వమును విసర్జించునట్లు మనుజుల ప్రోత్సాహపరుచువాఁడవు నీవే. అజస్రధారగా ప్రపంచమున ధర్మమును ప్రవహింపజేయువాఁడవు నీవే. అనంతా! నీవు గాకున్న మూన్నాళ్ల జీవించి మరణించు మర్త్యమాత్రుఁడు ధర్మమును లోకమున స్థాపింప నేర్చునా? ఎంతటి మహనీయులయినను నీ చేతిలోని ఉపకరణములేగదా ! శాశ్వతుఁడవగు నీవే ధర్మమును వర్ధిల్లజేయువాఁడవు. నీకు నమస్కారములు.

# భక్తాంజలి

ప్రభూ! నే నీబాధను భరింపజాలను. చూచుచు నీ వూరకొందువేల? ఈ ప్రలోభనమునుండి నన్ను తప్పింపఁజాలవా? హా! నే నెంతదుర్బలుఁడను. ఇంద్రియములయొక్క ప్రాబల్యము నా కిపుడుగదా పూర్తిగా నవగాహమయినది! అవి యే దిక్కునకు లాగిన ఆ దిక్కునకు, వెల్లువను బడి కొట్టుకొనిపోయెడు కలువకాడవలె, నేనును కొట్టుకొని పోవుచున్నాఁడను. నన్ను చూచుకొన్న నాకే ఆశ్చర్యమగుచున్నది. నే నార్జించిన జ్ఞానమేమయ్యెనో, నా ధైర్యస్థైర్యము లేమయ్యెనో, నా పట్టుదలయు, పటుత్వమును నే మయ్యెనో, నా ప్రతిజ్ఞ లేమయ్యెనో నాకే తోఁచుటలేదు. సుడిగాలి కెగిరిపోయెడు దూదిపింజలమాడ్కి నా సద్భావములెల్ల తిరోధానములై పోయినవి. మిక్కిలి దుర్బలమయిన "నేను" మాత్రము మిణుకు మిణుకుమని సన్నగా వెల్గుచు నాలో మిగిలియున్నది. ఏ శక్తి యుక్తుల తలపోసి నేను గర్వపడుచుంటినో అవి సమయమునకు నాకు సాయపడఁ జాలవయ్యెను. నీవే నా దిక్కు, నా శరణ్యము. నీవే నన్ను ఉద్ధరింపగలవాఁడవు. ఇంద్రియ వశీకరణ శక్తి, నాకు ప్రసాదింపుము. ప్రలోభనముల బారినుండి నన్ను తప్పింపుము. రక్షింపుము.

"పతితుడ నంచు మాటికినిఁ బల్కఁగ నేటికి నింద్రియంబు లే
గతినను బట్టి యీడ్చినను గాదనఁజాలక వానివెంట స
మ్మతి జనుచుంటిఁగాని యది మంచియొ చెడ్డయొ నే నెఱుంగ నా
గతి తుదకేమి చేసెదవొ కార్య వివేచక దీనరక్షకా!

# భక్త్యాంజలి

దీనశరణ్యా! దయానిధీ నీవు గాకున్న నాకిఁక దిక్కెవ్వరు? నీవు గాకున్న నా హృదయవేదనమును తీర్చువారు మఱియెవ్వరు? నీవుగాకున్న నా నిరుత్సాహమును పోఁగొట్టు వారెవ్వరు? నీవు గాకున్న నాకు ధైర్యమును ప్రసాదించు వా రెవ్వరు? నీవు గాకున్న మా దుఃఖ భారమును తొలఁగించు వా రెవ్వరు? నీవు గాకున్న నాకొఱకై చిమ్మచీకటిలో తేజోరేఖలను మెఱపించువారు మఱియెవరు? నీవే నిజముగా నా శరణ్యము! నా ప్రాపు; నా సర్వస్వము, కష్టబహుళమును దుఃఖమయమును పాపప్రలోభనా భూయిష్ఠమునునగు ఈ జీవనయాత్రను ఓపికతో సాగించుటకు నీ కారుణ్యమేగదా నాకు హెచ్చరికను కలిగించుచున్నది. ఎట్టి విషమపరిస్థితులలోనైనను, ఎట్టి క్లిష్టసమయములలోనైనను నిన్నొకసారి మనసార దలఁచినంతనే నిరాశతో క్రుంగిపోయిన నా హృదయము మఱల ఆశాపూరితమై ఉప్పొంగుచున్నది. దుస్తరమయిన యీ భవాబ్ధిని దాటుటకు నీ కృపానౌక యొక్కటియే నాకు సాధనము. తత్కృపాతరణిని ప్రసాదించి నన్ను రక్షింపుము.

---

పరమపావనా! నీ నామము నుచ్చరించుటకే నా పెదవులు తడబడు చున్నవి. పూర్ణ పవిత్రమూర్తివగు నీ వెక్కడ, పాపాధముఁడనగు నే నెక్కడ! నా హృదయములో నెంత కాలుష్యము! నా వాక్కులో నెంత పారుష్యము! నా పనులలో నెంత ధూర్తత్వము! నికృష్టపాపినగు నేను నీ సహవాసమును వరించుట యెంత సాహసము! కాని నన్నీసాహస కార్యమునకు ప్రోత్సాహపరుచుచున్న వారెవరు? నీవేగదా? ఇఁక నేను వెనుకాడ నేల? లజ్జపడనేల? పతితోద్ధారకా, నన్ను రక్షింపవలసిన భారము నీ మీఁదనే యున్నది. నా సమస్త పాపజాలమును నీ పవిత్ర తేజఃపుంజములచే కాల్చివేయవేని నేను నీదాపున కెవ్విధమున జేరఁగలను? చింతలోను. వాక్కులోను, చూపులోను, చేష్టలోనుఎట్టి దోషమును లేకుండునట్లు నీవే నాకు తోడ్పడవలయును. త్రికరణశుద్ధి కలిగినపుడే నిన్ను నేను చేరఁగల్గుదును, గాని లేకున్న నెట్లు చేరఁగలను? నీ పాదాక్రాంతమగుటకు నా బిరుసు మనస్సెంత వెనుకకు లాగుచున్నది? నా పెంకెతనమును తుత్తునియలుచేసి నన్ను నీకు లోఁబరుచుకొనుము. నా సమస్త కార్యములను నీవు శాసింపుము. నా దాసత్వములోనే నా మనస్సునకు శాంతి; నా హృదయమునకు ఆనందము.

---

# భక్తాంజలి

దయానిధీ! త్వదీయ దయారసాభిషేచనము వలన సకల హృదయతాపమును చల్లారిపోవునని చెప్పుదురుకాని కేవలము తద్విపరీతముగ నీ దయ నాడెందములో పనిచేయుచున్నదేమి? నీ కారుణ్యము నా మనస్సులో నెట్టి వేదనాగ్నిని కలిగించుచున్నది! ఎటనుండి వచ్చినది నీ దయాజలమున కిట్టి ఉత్తాపము! భూగర్భమునుండి అగ్నిపర్వత ముఖద్వారమున వెలువడు తప్తనీరమువలె నీ అపార అవ్యాజ కారుణ్యము నా మానసము నుడుకెక్కించుచున్నదిగదా! నేను కృతఘ్నుఁడను, పాపదూషితుఁడను, అయోగ్యుడను. నీ కఠినదండమునకు పాత్రుఁడనుగాని కారుణ్యమునకుఁ గాదు. కాని నా అర్హతానర్హతల పాటింపక నీవు నాపై నెడతెగని కరుణావృష్టిని కురిపించుచున్నావు. ఎందరెందరి మూలమున, ఎన్నెన్ని వైపుల నుండి, ఎట్టెట్టి రూపములతో నేఁడు నాకు నీ కారుణ్యము ప్రకటితమగుచున్నది! నీవు వర్షించు ఒక్కొక్క దయాబిందువు నా హృదయాంతర్గతమున నడగియున్న పాపలోపముల పైకి నెట్టి నన్ను దుఃఖసంతప్తునిఁ జేయుచున్నది. ఉష్ణదయాజలధారలఁ గురిపించి నా మనస్సు నావరించియున్న పాపమాలిన్యమును నీవు కడిగివేయ జూచుచున్నావు కాబోలు. పవిత్రునిఁజేసి నీ సేవకు నన్ను అర్హుని చేసికొమ్ము. రక్షింపుము.

ప్పరాత్పరా! నా మనస్సు నా కెన్నడు లోఁబడునో ? ఎట్లు లోఁబడునో నాకు తెలియరాకున్నది. నా మనస్సే నా మిత్రము. నా మనస్సే నా శత్రువు. నా మానసమును నీ శుభేఛ్ఛాధీనము చేయవలయునని యెంతకాలము నుండియో నేను ప్రయత్నించుచున్నాఁడను. కాని యిన్నాళ్ళనుండియు నేను చేయుచున్న యత్నములు ఈషణ్మాత్రమయినను ఫలించినట్లు కవిపింపవు. క్రొత్త నీళ్ళకు చేపలెక్కినట్లు నా మనస్సు అత్యధికమయిన దమకముతో దుష్టవిషయముల వైపునకే పరుగెత్తుచున్నది. సృష్టిలోను, సంఘములోను గల నీ సౌందర్యమును నాకు వెల్లడించి నా కానందమును కూర్పవలసిన నా నేత్రములు నాకు మోహమును గలిగించి నన్ను దుఃఖసంతప్తునిఁ జేయుచున్నవి. నల్దిక్కులను నీ మధురవాక్కులను, నీ మధురధ్వనులను వినుటకు తోడ్పడి నాకు సంతోషమును సమకూర్పవలసిన నా శ్రోత్రములు పనికిమాలిన మాటలను, పాటలను ఆలకించుటకు పరికరములై నాకు మనోవేదనమును ఘటించుచున్నవి. నీ సంకీర్తనమును గావించుటకును సత్యమును వచించుటకును అనుకూలపడి నా కెంతో మోదము నొసంగవలసిన జిహ్వ దురాత్ముల కైవారముచేయుటకును అసత్యముల పలుకుటకును సాయపడి నా కింతింతనరాని కీడును కలిగించుచున్నది. వివిధ పుష్పజాతులలోను నీవు నింపిన కమ్మతావుల నాఘ్రాణించి హాయి ననుభవించుటకు సాధనభూతముగా నుండవలసిన నా నాసికేంద్రియము నాలో దుష్టవాంఛల ప్రబలఁజేసి నన్ను భ్రష్టుని గావించుటకు కారణమగుచున్నది. ప్రేమాస్పదుల సంస్పర్శసౌఖ్యమునకు నుపకరించెడు ఈ నా దేహేంద్రియము తగనివారితో కూడుటకై యిచ్ఛను కలిగించి నన్ను చెడువానిని చేయుటకు వినియోగపడుచున్నది. ఇక నీవు ప్రసాదించిన కరచర

ణాది కర్మేంద్రియము లెన్నెన్ని పాడుపనులకు నుపయోగపడుచున్నవో చెప్పఁజాలను. సకలేంద్రియములను నీ యిచ్ఛానుసారముగ త్రిప్పి నాకు పరమానందమును సమకూర్చుటకు మాఱుగ నా మనస్సే వానిని దుష్ట మార్గమునకు మఱలించి నన్ను వేదనాగ్ని పాలుచేయుచున్నది. నా మనస్సును నీ యధీనముచేసి యెన్నడు బ్రహ్మానందము ననుభవింతునా యని వే నెదురుచూచుచున్నాను. దయాసింధూ! నన్ను అనుగ్రహించి, యాశీర్వదింపవా?

---

పరమేశ్వరా! నన్ను నీవు సంరక్షింప బూనుకొనకున్న నేను జీవింపజాలను. పూర్తిగా సారవిహీనమైనదై నా జీవితము నాకే వెఱపుగొల్పుచున్నది. నీ ఆరాధనపై నాకు మనసులేదు. నీ ప్రార్థనపై ఇష్టములేదు; నీ స్మరణపై రుచిలేదు; నీ భక్తుల సహవాసముపై ఇచ్ఛలేదు; నిన్ను గూర్చి ప్రసంగించు గ్రంథపఠనముపై ఆసక్తిలేదు; నీ సేవపై అనురాగములేదు. నీ యెడల నాకు ఘోరమైన అలక్ష్యభావ మేర్పడినది. నిన్ను విడనాడి నేను పొందుచున్న సౌఖ్యమేమైన నున్నదా? లేదు. ముమ్మాటికినిలేదు. నీ తోడి సంబంధమును పోగొట్టుకున్న నాకిక సుఖసంతోషములెట్లు రాఁగలవు ? నీవేగదా నిర్మలమైన సౌఖ్యమునకును ఆనందమునకును పరమ నిధానము? ఏ నాడు నిన్ను విడువ నారంభించితినో నాటనుండియు నా హృదయ కాసారము ఎండిపోవఁ దొడంగినది. ఒక్క ప్రేమబిందువయినను నాలో నిపుడు లేదు. అంతయు శుష్కత్వము ! నిస్సారమైన యీ పనుగడను నేనెట్లు గడపఁగలను? ప్రేమసింధూ! నా మానస సరోవర మీ తీరున మరుభూమిగా మాఱిపోవుచుండ నీవు చూచుచు నూరకొందువేల? నాపై నీకు కనికరము లేదా? నీవే దయ తప్పిన నాకిక తెరవేది? రమ్ము. పొంగి పొరలెడు ఉత్తుంగ తరంగములతో నొకసారి రమ్ము. త్వదీయ పవిత్ర ప్రేమజలమును నా హృదయ పద్మాకరములోనికి ప్రవహింపనియ్యక యడ్డుతగులుచున్న విషయలౌల్యమనియెడు ఇసుకతిన్నెను కోసి వేయుము. నీ కరుణాతరంగముల తాకుడునకు కఱగిపోఁజాలని తుచ్ఛవాంఛారాసులేమి యుండఁగలవు? నీ ప్రేమయే నా మానస సరసిలోనికి పాఱెనేని నా సౌభాగ్యమునకిఁక మేరయుండఁగలదా ? నా శుష్కత్వము నశించిపోదా? నీ యందును నీదు భక్తులయందును నా కనురాగము జనింపదా? నీస్మరణపై నీ సేవపై నాకు మనస్సు కలుగదా? నా జీవితము ధన్యముగాదా?

స్వామీ! ఏమి నీ కారుణ్యము! ఎట్టి శక్తిసామర్థ్యముల నీవు నాకు ప్రసాదించినావు! ఎట్టి గుణసంపత్తి ననుగ్రహించినావు! నీవు నా హృదయ సదనములో వెలిగించిన ఆశాప్రదీపమును గురించి స్మరించినపుడు నాకు అపరిమితాశ్చర్యము కలుగుచున్నది. ఆశాబలముచే నా యావజ్జీవితమును నీవు నడపుచున్నావు. నా ఐహికాభివృద్ధికేమి, ఆముష్మికాభివృద్ధికేమి ఆశనే నీవు మూలకందముగా జేసినావు. ఎంతవిద్యను గడించినను, ఎంత విత్తము నార్జించినను ఎంత అధికారమును పడసినను, ఎంత కీర్తిని సంపాదించినను నాకు సంతృప్తి కలుగుటలేదు. ఇంకింకను విద్యాధనాదుల సముపార్జింప ఆశ నన్ను ప్రోత్సాహపరుచుచున్నది. ధర్మపథమునందు ఆశయే నన్ను మున్ముందుకు గొంపోవుచున్నది. పొందినభక్తి జ్ఞాన వైరాగ్యములంతో సంతుష్టి పడి కూర్చుండనీయక ఆశ నన్ను వానిని విశేష రూపమున సంపాదింప హెచ్చరించుచున్నది. ఆశయొక్క వైఖరి అతి విస్మయజనకము గదా! చేసిన ప్రయత్నములు విఫలములై మనోరథ సిద్ధి కేదిక్కునచూచినను ఇంచుకేనియు నవకాశములు కనిపింపని మహాదుర వస్థలోగూడ అది యేమి చిత్రమో నాలో ఆశాదీపము మినుకు మినుకుమని వెలుంగునట్లు విధించినావు. ఎట్టి అభాగ్యస్థితిలో నున్నను భాగ్యము కలుగకపోవునా అన్న ఆశ విడువదుగదా! మృత్యువెంత చేరువనున్నను జీవింపకపోదునా అన్న ఆశ వదలదు గదా! పాపకూపములో నెంత దొరలాడుచున్నను పుణ్యవంతుఁడ కాగలనన్న ఆశ దూరముకాదు గదా! దయాళూ! ఆశాజ్యోతిచే ఇహపరముల రెంటిని నీవు భాసమానము చేయుచున్నావు. ఆశను ప్రసాదించి నన్ను ఆసక్తితో జీవించునట్లు చేయుచున్న నీకు నా వందనశతములు.

# భక్తాంజలి

ప్రేమనిధీ! ఏమి నీ ప్రేమ వితరణము! దశదిశలనుండి నీవు నాపై ప్రేమరసమును చిల్కుచున్నావు. గగనమండలము నలంకరించు గ్రహ నక్షత్రముల దివ్యకాంతిలో నీ ప్రేమయే నాకు గోచరమగుచున్నది. భూమండల మందలి నదీపర్వతములలోను, సరోవర సముద్రముల లోను, నీ ప్రేమాతిశయమునే నేను కాంచుచున్నాను. రుచ్యమగు ప్రతి ఫలములోను, సుగంధమయమగు ప్రతిపుష్పములోను నీ ప్రేమరసమునే నే ననుభవించుచున్నాను. జననీజనకుల వాత్సల్యములో, భార్యాభర్తల పరస్పరానురాగములో, దేశభక్తుని స్వదేశాభిమానములో, పరోపకార పరాయణుని మానవప్రీతిలో స్వామీ! నీ అపారప్రేమయొక్క ప్రతిబింబమే కానవచ్చుచున్నది, ప్రపంచము నిటుల ప్రేమభరితముచేసి నా ప్రేమ వికాసమునకు నీవు మితిలేని అవకాశమును కలిగించియున్నావు. అయినను, అది యేమి అభాగ్యమో, ప్రేమామృతముతో నిండిపోవలసిన నా హృదయ పాత్రలలోనికి ఎచటినుండియో ఈర్ష్య ద్వేషాసూయ రూపమయిన హాలా హలము వచ్చిపడుచున్నది. నీ ప్రేమమాధుర్యమును విరిచివేయుచున్న యీ విషము నెంత నిరోధింపవలయునని ప్రయత్నించుచున్నను నాకు శక్తి చాలకున్నది. పరమేశ్వరా! నీవు సాహాయ్యము చేయకున్న నే నీదుష్ట భావముల నా వలకునెట్టి నీ మానసమును ప్రేమాన్వితము చేసికోగలనా? రమ్ము! నాకు కేలూత నొసంగుము. నా అంతరంగములో ప్రేమను పెం పొంద జేసికొనుటకు తోడ్పడుము. ప్రేమలో దినదిన ప్రవర్ధమానుడనై నా ప్రేమాలింగనములోనికి సమస్త భూతకోటిని చేర్చుకొని నీ అనంత ప్రేమవారాసిలో నిమగ్నుడనగుటకన్న నాకు వేఱు మోక్షమేమి కలదు? వేఱు స్వర్గమేమి కలదు?

# భక్తాంజలి

పరమసఖా! నిన్నుఁబోలిన ఆప్తులు ప్రపంచములో నెవ్వరు గలరు? భాగ్యముతో తులదూగునపుడేమి, పేదఱికమున ముప్పతిప్పలఁబడు నపుడేమి, జనసమ్మానము ననుభవించునపుడేమి జనులచే పరిత్యజింపఁబడి నపుడేమి, సమభావముతో నీవు త్వదీయస్నేహలాభమును నాకు దయచేయు చున్నావు గదా! సర్వదా నీవు చెంత నుండి హెచ్చరికను కలిగించుచుండవేని నే నీ సంసారాంబుధిలో పయనము చేయగల్గుదునా? సఖా! ఎట్టి అమూల్యము లయిన హితోపదేశముల నీవు సమయము కనిపెట్టి నాకు ప్రసాదించు చున్నావు! మందబుద్ధుఁడనై నేను వానిని పెడచెవినిబెట్టినను నీవు నన్ను విడనాఁడవు గదా! సిగ్గుచే నేను దూరముగా పోవుచున్నను నీవు నా వెంటనే వచ్చి, నన్ను నీ వశము చేసికొనుచున్నావే! ఎట్టి ప్రాణస్నేహ మిది? ఇంతటి మిత్రత్వమునకు నా యందుఁగల యోగ్యతయేమి? స్వార్థ రహితమైన నీ స్నేహము నా యోగ్యతా యోగ్యతల పాటింపదు కాఁబో లు! సఖా! నీ స్నేహమే యనుభవింపకున్న నేనీలోకములో జీవింపఁ గలనా? నిన్ను చూచుకొనియేగదా నే నెంతటి సాహసకార్యముల కైనను గడంగుచున్నాను: ఎట్టి బాధలనైన నోర్చుకొనుచున్నాను! లోపలినుండి నీవు నన్ను హెచ్చరించుచుండిన జాలు. నిప్పులలో దుముకుటకైన నేను సిద్ధపడఁగలను. ఎట్టి దుస్థితిలోనున్నను, పరమస్నేహితుఁడవగు నీవు సర్వదా నా సమీపముననే యున్నావన్న సంగతిని నేను మరచిపోకుండు నట్లు కటాక్షింపుము. నా కష్టమును సుఖముగా, నా దుఃఖమును సంతో షముగా, నా లేమిని కలిమిగా, నా అవమానమును సన్మానముగా, నీ స్నే హము మార్చివేయగలదు. నీ స్నేహస్పృహను నాకు నిరంతరము ప్రసా దించి యాశీర్వదింపుము.

# భక్తాంజలి

జగదీశ్వరా! ఈ ప్రపంచమును నీవు ద్వంద్వమయముగ రచించియున్నావు. సుఖదుఃఖములును జయాపజయములును, లాభ నష్టములును, హర్ష శోకములును నా మానసమును కలవరపరుచు చున్నవి. నా యిష్టానుకూలముగ కార్యములు జరిగినపుడు సంతోషించుచు, ప్రతికూలముగ జరిగినపుడు విచారించుచు జీవనయాత్రను గడపుచున్నాను. నాకనుకూలముగ తోచినవి ఒక్కొక్కప్పుడు హానికరముగ పరిణమించుటయు, ప్రతికూలముగ కనిపించినవే మేలుచేయుటయు నేను పలుసందర్భములలో గాంచుచున్నాను. సర్వజ్ఞా! ఏది నాకు క్షేమకరమో ఏది కాదో నీకు తెలిసినట్లు నాకు తెలియగలదా! నీ యిచ్ఛనే సకల విషయములందును ప్రమాణముగ గైకొనెడు శుభబుద్ధిని నా కనుగ్రహింపుము. సర్వదా నీవు నా క్షేమమునే కోరుదువనుటకు సందేహ మేమి? నీ యిష్టమును కవిపెట్టి ప్రవర్తించుట కంటె నాకు కర్తవ్యము వేఱుండజాలదు. కష్టముగానీ సుఖముగానీ ఏద్ది నీవు ప్రసాదించినను దానిని కృతజ్ఞతాభావముతో నేను గ్రహింతునుగాక! ద్వంద్వాతీతుడనై సమదృష్టితో సమస్తవ్యవహారములందును నేను నడుచుకొందునుగాక!

"ఎవడు అప్రార్థితముగ ప్రాప్తించిన లాభముతోఁ సంతుష్టుడై యుండునో,
ద్వంద్వములకు లోబడనివాడై యుండునో,
వైరభావములు లేనివాడైయుండునో,
జయాపజయములందు హర్ష విషాదములు లేనివాడై యుండునో
అట్టివాడు కర్మలను చేసినను కర్మఫలముచే కట్టుబడడు" గీత.

# భక్తాంజలి

పరమేశ్వరా! నీ కెపుడు నాపై దయగల్గునో తెలియరాకున్నది. ఎంత కాలము నీవు నన్ను పరీక్షింతువు? నీ పరీక్షకు నే తాళగలనా? ఇంతపరీక్ష యేల? నేను దుర్బలుడను; ముమ్మాటికి దుర్బలుడనే. నా మనస్సును నీ యిచ్ఛతో అనుసంధింపజాలక కొట్టుకొనుచున్నాను. స్వప్రయత్నముచే దీనిని సాధించుట అసాధ్యమని తెలిసిపోయినది. నా గర్వము నశించినది. నీ పాదాక్రాంతుడనై నాడను. అవ్యాజమైన నీ కృప తప్ప నాకు వేఱు గతి లేదు. నీవు కృపాసింధువుగావా? ఒక్క కృపాబిందువు నామీద చిల్క రాదా? చాలు, ఒక్క బిందువు చాలు. నేను గట్టెక్కుదును. నీ దయ కొఱకై నిరీక్షించి నిరీక్షించి విసుగెత్తుచున్నది. శాంతిలేక, సుఖములేక, ఆనందములేక నేను తల్లడిల్లి పోవుచున్నాను. నా స్థితినిజూచిన నీకు జాలికలుగుట లేదా? సాహాయ్యము చేయగల్గియు నీవేల యూరకొన్నాడవు? నీ చర్యల అంతరార్థము నీకే బోధపడవలెను. నిన్నుమాత్రము నేను విడువను. నీ దయనుగోరి నేను నిన్ను సర్వదా భజించుచునే యుందును.

---

# భక్త్యాంజలి

పరమేశ్వరా! ఎట్టి సమీప సంబంధము నీకును నాకును. నీవు అఖండ ఉజ్జ్వల జ్ఞాన తేజోరాశివి; నేను ఆ మహారాశిలో ఒక్క రేఖను. నీవు అనంత అపార ప్రేమసాగరము; నేను ఆ మహాసాగరములో ఒక్క బిందువును. నీవు అక్షయ అమూల్య పుణ్యసువర్ణఖనివి; నేను ఆ మహాఖనిలో ఒక్క రేణువును. ఇఁక నిన్ను విడిచి నే నెట్లుండఁగలను? నన్ను విడిచి నీ వెట్లుండఁగలవు? నీలో నే నున్నాను; నాలో నీ వున్నావు. తెలిసికొన్నచో ఒకరి కొకర మెంతదగ్గర! తెలిసికొనలేనిచో ఎంతదూరము! తెలిసికొంటిమని యనుకొనుటలో నెంత భ్రాంతి! తెలియదని కూర్చుండుట యెంత అవివేకము! ఇంత సమీపమును, ఇంత మనోహరమునగు ఈ బాంధవ్యమును గ్రహింప నీయని నా మోహాంధకారమును పటాపంచలు చేయుము. సర్వకాలములందును, సర్వావస్థలయందును ఓ పరబ్రహ్మమా! మన యిరువురికిని గల యీ సంబంధమును నే మనస్సులో నుంచుకొని తదను గుణముగా మెలంగునట్లు కటాక్షింపుము.



7

పరబ్రహ్మమా! నీవు సర్వాంతర్యామివి: సర్వజ్ఞుఁడవు: సర్వ విధాయకుఁడవు. నీవు లేనిస్థలము లేదు. నీ వెఱుంగని విషయము లేదు. నీకు సంబంధింపని యంశము లేదు. సమస్త భూతములను నీవు శాసించుచున్నావు. సకల మానవ వ్యాపారములను నీవు నడుపుచున్నావు. యావద్విశ్వమును నీవు పరిపాలించుచున్నావు. నీ యాజ్ఞ అప్రతిహతమై యెల్లెడల సాగుచున్నది. నీ మంగళోద్దేమును గ్రహింపఁజాలక నేను దుఃఖాక్రాంతుఁడ నగుచున్నాను. పరమేశ్వరా! ఎల్లకార్యములలోను నీ శుభేచ్ఛను తెలిసికొనఁగల్గునట్టి బుద్ధి పాటవము నా కెట్లు రానేర్చును? నేను మితజ్ఞుఁడను: దేశకాలబద్ధుఁడను, తాత్కాలిక స్వసౌఖ్యమును మించి దూరమాలోచింపఁజాలని అల్పమతుఁడను! దయాసింధూ! నీ యిచ్ఛకు నెదురు తిరిగెడు నా మంకుతనమును నిర్మూలము చేయుము. కష్టములుగానీ సుఖములుగానీ, దుఃఖములుగానీ సంతోషములుగానీ, జననములుగానీ మరణములుగానీ ఏవి సంభవించినను అన్నియు నీ శుభోద్దేశ సాఫల్య సాధనములేయని యెంచి శాంతచిత్తముతో వానిని స్వీకరించెడు మనోపరిపక్వతను నా కనుగ్రహింపుము. నీ యిచ్ఛకు లోబడఁజాలక నా డెందమెంత కొట్టుకొనుచున్నది. భూత వర్తమాన భవిష్యత్తుల గమనించి నీవు కావించెడు కార్యములయొక్క యుక్తా యుక్తములను పరిమిత బుద్ధుఁడనగు నేను నిర్ణయింపఁ బూనుకొనుట యెంత సాహసము: శక్తికి మించిన పనికి దొరకొని చింతలలో చిక్కువడి తల్లడిల్లుచున్న నాకు, పరమేశ్వరా! సన్మార్గమును కనఁబరుపుము. నీ సదభిప్రాయమునందు పరిపూర్ణ విశ్వాసముంచి సకల అవస్థా భేదములలోను నిర్మల మనస్కుఁడనై నేను జీవన యాత్రను గడపునట్లు కటాక్షింపుము.

# భక్తాంజలి

విశ్వవిధాతా! యీ చల్లని సమయమున నా హృదయము నీకు కృతజ్ఞతా భరితమై నమస్కరించుచున్నది. దయాకలితుఁడవై ఋతువు తరువాత ఋతువును నీవు సక్రమముగా నడిపించుచుండఁ బట్టిగాని లేకున్న యెవ్వరిచట జీవింపఁగలరు? అసంఖ్యాకములగు నీ జీవరాసులు జీవింపఁగలవా? దుస్సహగ్రీష్మతాపముచే వాడి బడలియున్న ప్రాణికోటుల సంరక్షించుటకై నీ వెంత తహతహలాడుచున్నావు! తీక్షణములైన యెండలు తగ్గీ తగ్గక పూర్వమే శీతలాంబుపూరితములగు మేఘములను నీవు గగనవీధిని సంచరింపఁజేయుచున్నావు గదా! తొలకరివానలకు జను లెంత నిన్ను స్తుతించుచున్నారు! జనులే యనవేల! చల్లని చినుకులలో తమ మేనుల హాయిగా తడుపుకొనుచు మోరలెత్తుకొని నోరులేని పశుగణ మెంత నిన్ను స్తోత్రించుచున్నది! వెచ్చఁగా తమ కులాయములఁగూర్చుండి పక్షిసంతానము మాత్రము నిన్ను స్మరించుటలేదా? వృక్షసమూహము సయితము వర్షధారలలో స్నానమాడుచు నిశ్శబ్దముగా నిన్ను ధ్యానించుచున్నట్లే తోఁచుచున్నది. సమస్త సృష్టియు వర్షాగమనమునకు నీకు వందనము లర్పించుచున్నది. నీ కారుణ్యాతిశయమును నే నెంతనికొని యాడఁ గలను! దురతిక్రమణీయమయిన నీ యాజ్ఞకులోఁబడి జలధరములు బారులు తీఱి నానాప్రాంతములకు పరువులెత్తి వర్షమును క్రుమ్మరించుచున్నవి. ఇంకిపోయిన వాపీకూప తటాకములను కప్పలు బెక బెక లాడునట్లు నీటితో నింపివేయుచున్నవి; సన్నకాలవలుగ పాఱుచున్న జీవనదులనెల్ల జలసమృద్ధములు చేయుచున్నవి; ఎండి బీటలువాఱిన భూస్థలిని సిక్తము చేసి కర్షకుని కానందము గూర్చుచున్నవి. నిశ్చయముగా వర్షధారలు నీ కృపాధారలుగాని వట్టి నీటి బిందువుల సందోహముగాదు.

> ఈ అక్షరపురుషుని శాసనముచేత, ఓ గార్గీ, నిమిషములు,
> ముహూర్తములు, అహోరాత్రములు, పక్షములు,
> మాసములు, ఋతువులు, సంవత్సరములు.— యథాస్థానమున
> నిలుచబడినవై యున్నవి — ఉపనిషత్.

## భక్తాంజలి

పరమాత్మా! నీకంటె ఆప్తమిత్రుడు లోకములో నా కెవ్వరు గలరు? నీకు తెలుపరాని రహస్యము నాకేది గలదు? నేను తెలుపనేల? మనస్సును జొచ్చిచూడఁగల నీకు గోచరము గాని విషయ మేమియుండును? సర్వమును నీవు స్పష్టముగా గ్రహించుచున్నావు. నేను చింతించు చింతలనేమి, నేను పల్కు పల్కులనేమి, నేను కావించు కార్యములనేమి,—సకలమును నీవు తెలిసికొనుచున్నావు. తెలిసికొన్నను నీవు మనుష్యులవలె హేళనచేయువాఁడవు గావు; హింసించువాఁడవును గావు. నా దౌర్బల్యము నీకు తెలియనిది గాదు. కావుననే నీవు ప్రేమోపేతములగు మృదువాక్యములచే నన్ను సన్మార్గునిగాఁజేయ సదా ప్రయత్నించుచున్నావు. లోకములోని యే మిత్రులును నీకు సాటి రాఁజాలరు. నీకు విసువులేదు; అసహనములేదు; అసూయలేదు. నీవు ప్రేమభరితుఁడవు. అపరాధములఁజేసి, మోమెత్తి నిన్ను చూడఁజాలక సిగ్గున తలవంచుకొని దూరముగా తొలఁగి పోవుచున్నను నన్ను అట్లు పోనియ్యక నీ ప్రేమబాహువుల దీర్ఘముగాఁ జాచి వానిలో నన్ను బంధించుకొనుచున్నావు. అవ్యాజమయిన నీ ప్రేమాతిశయముచేతనే నన్ను ఉద్ధరించుచున్నావు. నీ స్నేహభాగ్యమును నిరంతరము అనుభవించుచు నేను ధన్యాత్ముఁడనగునట్లు కటాక్షింపుము.

మనసును జొచ్చి చూచెదవు మాటలచే నిను మోసపుచ్చఁగా
నసువగునే పరాత్పర! సమంచిత చారుచరిత్ర నీకు నా
మనసును విప్పి చూపెదను మానక నన్నుఁ గృతార్థుఁ జేయవే
చనవున నిన్నుఁ జేరితిని సజ్జన జీవన! లోకపావనా!

---

# భక్తాంజలి

పరమపురుషా! నీ దివ్యదర్శనముకొఱకై నా హృదయము పరితపించుచున్నది. పర్వతపంక్తులలో నీ గాంభీర్యమును గాంచి నిశ్చేష్టితుఁడనైతిని. మహాసముద్రములో నీ అద్భుతశక్తినిఁ జూచి ఆశ్చర్యనిమగ్నుఁడనైతిని. సుందరోద్యానములలో నీ సౌందర్యాతిశయమును తిలకించి ముగ్ధుఁడనైతిని. నక్షత్రశోభిత నీలాకాశములో నీ ప్రశాంతలావణ్యమును వీక్షించి ఆనందించితిని. కాని, ప్రభూ! పరమేశ్వరా! మహాపురుషులలో నీవు ప్రకటించు సౌందర్య గాంభీర్యాదులగూర్చి తలపోసినపుడు నాకు కలిగెడు ఆశ్చర్యానందములకు మేరలేదు. ప్రతి దేశమునందును, ప్రతి యుగమునందును మహనీయు లనేకుల నుదయింపఁజేసి నిరుపమాన ప్రభావాన్వితములగు వారి జీవితముల ద్వారమున నిన్ను నీవు తెలియబరుచుకొనుచున్నావు. నీకు నా హృదయ పూర్వక వందనములు.

---

పరమేశ్వరా! నీవు దయాసముద్రుఁడవని చెప్పుదురు, నీ దయ అపార మైనదే కావచ్చునుకాని, కావలసిన యెల్లవారికిని నీ కారుణ్యము లభించు చున్నదా? అన్యుల మాట నాకేల? నా యెడల నీవు దయను చూపవేమి? ఆ మహాజలధిలోని ఒక్క చుక్కను నాపై చినికిన చాలునే! ఒక్క బిందువును వదలుటకే నీ కింత కష్టమా? ఎంతలోభత్వము నీకు? ప్రభూ! దీను లకు పనికిరాని దయ, పాపులకు కొఱగాని దయ, ఆర్తులకు అందుబాటులో లేని దయ—ఇట్టి దయవలన ప్రయోజనమేమి? అంతశ్శత్రువులతో నే నెంత కాలమునుండి పోరాడుచున్నాను! నాయనా! ఈ రిపుల జయించుట యెన్నటికో గదా! లోఁబడని శత్రువులు లోఁబడకనే యుండ లొంగిపోయినవని నే సంతోషించిన శత్రువులు గూడ మఱల తలయెత్తి నా ప్రాణముల తీయుచున్నవి. స్వామీ! సర్వజ్ఞుఁడవయిన నీకు నే పడు చున్న యీ బాధ తెలియకయున్నదా? తెలిసి యూరకుండుట దయావంతుల లక్షణమా? నా యీబాధకు అంతము లేదా? కనికరంపుఁగనివైన నీవు నాపై కన్నెత్తియేల చూడవు? ధర్మాధర్మములకు నాలోజెలిపిలేక యిట్లు పోరాటము సాగుచుండ, దయానిధీ! నాకు మనశ్శాంతి యెట్లు కుదుర నేర్చును? ఆనంద మెట్లు నాకు సమకూర నేర్చును? శాంత్యానందముల కొరని యిరుఁడు లోకములో నెవ్వఁడైన నుండునా? ఈ అశాంతికి ఈ నిరానందమును కృపామయా! నేను అనుభవింపఁజాలను. ఉచ్ఛ్వాస నిశ్వాసములవలె నాకు ధర్మమెన్నఁడు స్వాభావికమగును? లోభత్వమును వీడి ఒక్క దయాశీకరమును ఈ దీనునిపైఁ జిల్కి ఆశీర్వదింపుము.

---

దయాసింధూ! అయాచితముగ నీ వెన్నిటినో నా కిచ్చియుంటివి. ఇంకను ఇచ్చుచుంటివి. అది కావలయు నిది కావలయు నని నిన్ను మాటి మాటికి నే వేధింపనేల? అపారమయిన నీ కారుణ్యమువలన భౌతికవస్తుసంపదను మించిన సంపత్తిని నే గ్రహించునట్లు చేసితివి. ఆ సంపత్తినిఁ బడయకున్న నాకు సంతృప్తి లేకుండునట్లు నీవు నా మనస్సును నిర్మించితివి. నేను కోరనిదే తత్సంపత్తి నాకు లభింపకుండునట్లు నిర్ణయించితివి. అదియేమి అభాగ్యమో దేహాధీనమై నా హృదయము అస్థిరములయిన పదార్థముల వైపునకే పరుగెత్తుచున్నది. ఎఱిఁగియుండియు వ్యర్థములయిన వస్తువులనే నా మానస మెంతయో ఆసక్తితో వాంఛించుచుండును. అసారములయినవని అనుభవమువలన తెలిసికొన్న సుఖములకొఱకే నా డెందము పరితపించుచుండును. నా యీ మానసికధోరణిని నీవు తప్ప మఱియెవ్వరును మఱలింపఁజాలరు. అధోముఖమైయున్న యీ హృదయమును ఊర్ధ్వముఖము చేసి ధర్మము నిమిత్తమై పరితపించునట్లు చేయుము. ఉత్తమవాంఛ లెన్నియో నా మనోవీధిలో తోఁచుచున్నను వానిని సాధింపవలయునన్న పట్టుదల మాత్రము నా కబ్బుటలేదు. సర్వశక్తి సంపన్నుఁడవగు నీవు నా కీగుణమును ప్రసాదింపనేరవా? ధర్మసంపదను గడించి నే నవిరతానందమును పొందవలయునని నీ కిష్టములేదా? నా మనోనిశ్చయమును నీవు పరీక్షింపఁ బూనుకొన్న నేను నీ పరీక్షకు తాళఁజాలిన వాఁడను గాను. నేను దుర్బలుఁడను. ముమ్మాటికి దుర్బలుఁడను. నా శక్తిని నేను నమ్మికొని యున్నవాఁడను గాను. అవ్యాజమైన నీ కారుణ్యమునే నేను నమ్మినాఁడను. కృపాజలధీ! నా హృదయమును నీ వైపునకు మఱలించుకొని నన్నుద్ధరింపుము.

# భక్తాంజలి

మధురము గదా, పరమాత్మా, నీ సంస్మరణము ! మధురము నీ ఆరాధన, మధురము నీ భజన, మధురము నీ ధ్యానము. మధురము నీ ప్రార్థన, మధురము నీ నామగానము. మధురము నీ సంసేవనము. మధురము నీ భక్త శిఖామణుల ప్రశంస. మధురము నిను గుఱించి చేయు జ్ఞానాలోచనము. మధురము నీ కొఱకై చేసెదు త్యాగము. మధురములు నీ ప్రీతికై కావించెదు దాన ధర్మములు. మధురములు నీవు విధించెదు శిక్షబహూమానములు. మధురములు నీవు ప్రసాదించెదు కష్టసుఖములు. నీ యిచ్ఛానుసారం మనుభవించెదు రోగమరణములు పైతము మధురములే. కుటుంబసంబంధములలో నెట్టి మాధుర్యమును పెట్టితివి. దాంపత్యానురాగములోని మాధుర్యము నీ మాధుర్యము గదా! మాతృవాత్సల్యములోని మాధుర్యము నీ మాధుర్యము గదా ! మిత్రుల అన్యోన్యప్రేమలోని మాధుర్యము నీ మాధుర్యము గదా ! దేశభక్తుని దేశాభిమానములోని మాధుర్యము నీ మాధుర్యము గదా ! నీవు మధురస్వభావుఁడవు. నీ సకల సృష్టి మాధురీ భరితము.

---

విశ్వపితా! ఈ విశాలప్రపంచమున కెల్ల నీవు సంరక్షకుఁడవై విలసిల్లు చున్నావు. చేతులుమోడ్చి నిన్ను నే నంస్మరించు నీ సమయమున నెన్నెన్ని దేశములలో నెందరెందఱు నిన్ను ఈ విధమున భజించుచున్నా రోగదా! నన్నును నా చుట్టునున్న వారిని గూర్చియేగాక ప్రేమప్రపూర్ణ హృదయములో జగత్తులోని యెల్లరినిఁ గూర్చియు చింతించుటకు తగిన హృదయ విశాలతను నాకు ప్రసాదింపుము. నా కాయువు నా కారోగ్య మనెడు సంకీర్ణభావమునుండి నా మనస్సును తప్పింపుము. నీ మహా కుటుంబములో నెవ్వరెవ్వరికి సంతోషము కలిగినను ఆ సంతోషమునెల్ల నా సంతోషముగను, ఎవ్వరెవ్వరికి దుఃఖము సంప్రాప్తమైనను ఆ దుఃఖమునెల్ల నా దుఃఖముగను తలపోయుచు సమస్త వసుధను తమ కుటుంబముగ భావించెడు ఉదారచరితుల మార్గము ననుసరించి చరించునట్లు నన్నుకటాక్షింపుము. సర్వదా యెల్లవారికిని శ్రేయస్సునే కోరెడు హృదయ మార్దవమును నాకు దయచేయుము. దేశభేదమును బట్టియు, వర్ణభేదమును బట్టియు, జాతిభేదమును బట్టియు, మతభేదమును బట్టియు, ఐశ్వర్యభేద మును బట్టియు, జ్ఞానభేదమును బట్టియు సర్వసాధారణముగా కలుగు చుండెడు వికారములనెల్ల సంపూర్ణముగా నాలో రూపుమాపుము.

---

పరమేశ్వరా! ఏమి చదువులు! ఏమి సాధనలు! ఏమి భజనలు! ఎన్ని గ్రంథములో పఠించితిని! ఎన్ని సాధనలో సలిపితిని! ఎన్ని భజనలో కావించితిని. కాని అడుగు ముందుకు సాగుటలేదు. నా కామ్యములు నా కామ్యములే. నా క్రోధములు నా క్రోధములే. నా లోభములు నా నా లోభములే. నా ద్వేషములు నా ద్వేషములే. నా ఈర్ష్యలు నా ఈర్ష్యలే. నా సాధింపులు నా సాధింపులే. నా ఆడంబరములు నా ఆడంబరములే. నా గర్వములు నా గర్వములే. స్వామి! నా జ్ఞానము నన్ను మోసపుచ్చినది. నా ప్రార్థనలు నన్ను భ్రమింపఁజేసినవి. నా యూహలతోడను, మాటలతోడను నిర్మింపఁబడిన మాయహర్మ్యములో నేను నివసించు చున్నాను. తండ్రీ! నా మాయను నశింపఁజేయుము. నేను నా యథార్థ స్థితిని గ్రహించునట్లు చేయుము. నన్ను సరియైన మార్గమున ప్రవేశ పెట్టుము. నన్ను బాధించెడు నానాదుష్టప్రవృత్తుల బారినుండి నన్ను రక్షింపుము.

———

# భక్త్యాంజలి

దయానిధీ! పరమేశ్వరా! నీకు నా సాష్టాంగ ప్రణామము లాచరించుచున్నాను. ఒక సంవత్సరము తరువాత నొక సంవత్సరము వచ్చుచు పోవుచున్నను నా హృదయము మాత్రము మార్పుచెందక శిలాసదృశమై యథాప్రకారముగనే నిలిచియున్నది. నా యంతరంగమునందు నీ వేల పరివర్తనమును కలిగింపవు? సర్వశక్తిమంతుఁడవగు నీకు సాధ్యముగాని విషయమేమి గలదు? భక్తిలేక, విశ్వాసములేక, ఆనందములేక, ఉత్సాహములేక, జడత్వమునుదాల్చియున్న నా యీజీవనములో నీవు మార్పును కలిగింపఁజాలవా? మోడువడిన మ్రాకులను పల్లవింపఁజేయు విచిత్రశక్తి శాలివే నీవు. నీకీ కార్యము చేతకాకుండునా? స్వామీ! నీవు నేను పొందెడు మనస్సంక్షోభమును తిలకించుటలేదా? చూచుచు నీ ఉపేక్ష వహించి యూరకుందువేల? నీవే నా సంగతిని పట్టించుకొనకున్న ఇఁక నావైపు కన్నెత్తి కాంచు వా రెవరు? హృదయము దహించుకొని పోవుచున్నది. నీ సాంగత్యముకొఱకు ఆత్మ ఉవ్విళ్లూరుచున్నది. కాని నీవు నన్ను దగ్గరకే రానీయవైతివి, నే జీవించుటెట్లు? నేను దుర్బలుఁడనే; అసంఖ్యాకపాపముల నాచరించి నిన్ను నొప్పించినవాఁడనే. అయినను నే నిపుడు నీ శరణుఁజొచ్చి నాఁడను. నీ కృపాభిక్షను అర్థించుచున్నాను. సదయహృదయుఁడవై ఒక్కసారి యీ హతభాగ్యుని ఈ దీనుని, ఈ మలినమానసుని, ఈ పరితప్త చిత్తుని, ఈ బాష్పాకులితనేత్రుని చూడుము. నీ యనుగ్రహములేక నే నే తీరున సుఖముగా జీవింపఁగలను? తండ్రీ! ఆశీర్వదింపుము.

పరమాత్మా! ఎన్నఁడు నీకు నాపై దయకలుగునో యని యెదురు చూచుచున్నాను, నీ కృపా సాహాయ్యము లేక నా జీవనములో నెట్టి పరివర్తనమును కలుగఁ జాలదు. ఎన్ని గ్రంథముల పఠించినను ఎన్ని సాధనల జేసినను, ఎందరు మహనీయుల దర్శించినను, ఎన్ని పుణ్య స్థలముల కరిగినను నీ అనుగ్రహము లేక నేను భక్తియందుగాని, జ్ఞానమునందుఁగాని, వైరాగ్యము నందుఁగాని, సేవాతత్పరత్వమునందుఁ గాని వృద్ధిఁగాంచ జాలను. నీకు నాపై నేల కృప కలుగునో, ఎపుడు కలుగునో, ఎటులఁగలుగునో నాకు తెలియదు. నీ కృపాతత్వము అతి దురవగాహము గదా! అంతయు నీ కృపయే యని చేతులు ముడుచుకొని కూర్చుండుటకును వలనుగాదు. నా శక్తి యుక్తుల మీఁదనే నా జీవనోన్నతి ఆధారపడి యున్నదని నిన్ను నిర్లక్ష్యముచేసి ఆత్మ విశ్వాసముతో జీవించుటకును వీలుపడదు. నా ప్రయత్న మెక్కడ నాగునో నీ కృప యెక్కడ ప్రారంభమగునో అల్పబుద్ధి సంపన్నుఁడనైన నే నెట్లు తెలిసి కొనఁగలను? నా మనస్సున కందఁజాలని యీ సమస్యను పరిష్కరించుటకై నేను ప్రయాస పడనొల్లను. నీ అవ్యాజ కారుణ్యమునందు పూర్ణ విశ్వాసముంచి శక్తి వంచన లేకుండ నేను నా కర్తవ్యమును నిర్వహింతును. నీవు కృపా సముద్రుడవని భక్త శిఖామణులు వచించు వాక్కు దబ్బర కాదు గదా! నా జీవనము, నా కరచరణాద్యవయవములు, నేత్రేంద్రియములు, నా యూహలు, నా ఆలోచనలు, నా సంకల్పములు నా ఆదర్శములు, నా కర్తవ్య బుద్ధి, నా ప్రయత్నములు— ఈ సమస్తమును నీ కృపా విశేషము గాక మఱియేమి? నా విధ్యుక్తమును నేను నిర్వహించుటయు నీ కృపా విధానములో భాగమే గదా! ఇంత వరకు నీవు కనబరచిన కృపకు నేను తగిన విధమున ప్రవర్తించి నపుడు గదా అధిక కృపకు నేను పాత్రుడను కానేర్తును? అయినను నీ కృప వినా నాకు వేఱు శరణ్యము లేదు. నీ కృపయే నా సర్వస్వము.

# భక్తాంజలి

జగత్పితా! సమస్త దేశములను సమస్తమానవజాతులను పోషించి, పరి పాలించువాఁడవు నీవు. ఎచ్చటెచ్చటనున్నను, ఎన్నెన్నిభేదములు గలవార మైనను మేమెల్లరమును నీ సంతానము. నిన్ను తెలిసికొనుటకంటె, నిన్ను ప్రేమించుటకంటె, నిన్ను సేవించుటకంటె, నీలో మేమందరమును నొక్కటేయనిగ్రహించి తదనుగుణముగా నడచుకొనుటకంటె మాకు శ్రేష్ఠతరమైన మతమింకేమి గలదు? విశాలమైన యీ ధర్మతత్త్వమువెలుఁగి ప్రశాంతముగా జీవించుటకు మాకు శుభబుద్ధిని ప్రసాదింపుము. మా హృదయముల ముకుళింపఁజేయు సకల సంకుచితభావములనుమాకుదూరము చేయుము. మనుష్యులలో ద్వేషములను, కలహములను, యుద్ధములను పెంపొందఁజేయు అభిప్రాయములను క్షీణింపఁజేసి ప్రేమను, స్నేహమును, శాంతిని, వర్ధిల్లఁజేయు అభిప్రాయములను ఉద్దీపింపఁజేయుము. "సర్వేజనాస్సుఖినోభవంతు" అన్నఉదారభావము మా జీవితములను పరి పాలించునట్లు కటాక్షింపుము.

---

# భక్తాంజలి

పరమగురూ! ప్రసన్నుడవుగమ్మా. నీ వాక్కుల నాలకింప నా మానసము తమకముతో నెదురు చూచుచున్నది. నీవు తీర్పకున్న నా సంశయములు తీరజాలవు. నీవు నేర్పకున్న నాకు సుజ్ఞానము కలుగనేరదు. నీవు గురువులకెల్లను గురువు; మహాగురువు. నిజముగా సమస్త సత్యములును నీ నుండియే వచ్చుచున్నవి. నీవు బోధింపఁబూనుకొన్నప్పుడు దురవగాహములగు మహావిషయములు సయితము నాకు త్రుటిలో కరతలామలకము లగుచున్నవి. నిన్ను లక్ష్యముసేయక స్వప్రయత్నమునే నమ్ముకొని సత్యాన్వేషణమునకుఁ గడంగినపుడు సామాన్యములయిన యంశములు గూడ దుర్గ్రాహ్యములయి నన్ను దీర్ఘకాలము బాధపెట్టుచున్నవి. గురువరేణ్యా! గర్వమును విడనాడి నీ పాదాక్రాంతుడనగుచున్నాను. పరమజ్యోతివై నా హృదయాకాశమునందు ప్రకాశించి నా అజ్ఞానాంధకారమును పాఱద్రోలుము, ఆశీర్వదింపుము.

---

పరమాత్మా! జగత్తునంతయు ప్రకాశింపఁ జేయుచు జాజ్వల్యమానముగ వెలుఁగుచుండిన మహాజ్యోతిని నీ విపుడు ఆర్పివేసి పలుపైపుల సంధ్యా రాగమును వ్యాపింపఁజేసినావు. సకలధ్వనులను అడంచివేసి ప్రకృతి యం దంతట పవిత్రమైన శాంతత్వమును నెలకొల్పుచున్నావు. ఇవ్విధమున నామనస్సు నీతో సంయోగమునుజెందుటకై సర్వమును సిద్ధపరు చుచున్నావు. దినమంతయు నీ సేవనే చేయుచున్న వాఁడనైనను నేను నిన్ను మఱచియే ప్రవర్తించితిని. అనునిమిషమును నా మనశ్శరీరముల కనిపెట్టుచు, అడుగడుగునకును సాహాయ్యముచేయుచు నీవు నన్ను నడుపుచునే యుండినను నీ సంస్పర్శను నేను గ్రహింపఁజాలనైతిని. కాని నిన్ను నేను గ్రహించితినోలేదో, నేను నిన్ను ప్రేమించితినో లేదో యని నీవు పరీక్షించువాఁడవుగావు. తెలిసి తెలియని శిశువును తల్లి యేవిధమున తన చేతులలోఁబెట్టుకొని కాపాడునో ఆ విధముననే నీవును నాకు తెలియకుండఁగనే నన్ను సంరక్షించుచు వృద్ధి పొందించుచున్నావు. ఏది నా శక్తియనియు, నా జ్ఞానమనియు నే ననుకొనుచున్నానో ఆశక్తియు జ్ఞాన మును నీ యవియే. సమస్తమును నీదే. నేను విన్న సర్వములోను, నేను అనుభవించిన సర్వములోను, నేను నేర్చుకొన్న సర్వములోను, నేను చేయగల్గిన సర్వములోను, నేను నీ ప్రేమనే చూచుచున్నాను. నీవు కావించు నుపకారములు అసంఖ్యాకములై యున్నవి. నేను చూపించెడు స్వల్పమాత్రమైన యీ కృతజ్ఞత అనంతమును అక్షయమునైన నీ యను రాగమునకు తగిన ప్రతికృతియెట్లు కాగలదు? నీ జ్ఞానమునందును, నీ ప్రేమయందును, నీ కార్యాచరణమునందును నేను క్రమ క్రమముగా పెం పొందునట్లు కటాక్షింపుము. ఓ పరమపావనా! నేను ఈ దినములో నీ యెడల నెన్నిమాఱులు నిర్లక్ష్యమును చూపితిని! ఎన్ని దుశ్చింతలను, ఎన్ని

దుర్భావితలను నేను నా మనస్సులోనికి రానిచ్చితిని; వచింపరాని వాక్కుల నే నెన్ని వచించితిని; చేయవలసిన కార్యములెన్ని నేను మానివేసితిని; మానవలసిన వానినెన్ని నేను చేసితిని; ఈ అపరాధములెల్ల నన్ను దుఃఖ సంతప్తుని జేయుచు నీ తోడి సంయోగమునకు నాకు ప్రతిబంధకమును కల్పించుచున్నవి. మఱింతస్పష్టముగా నీవు నా యెదుట ప్రకాశింపుము. నీ పవిత్రశక్తిని నా కనుగ్రహింపుము. ఐహికసుఖాసక్తి నాకు సంపూర్తిగా తొలగి పోవునట్లు నీ సౌందర్య మాధుర్యములతో నా హృదయమును నింపివేయుము. నీ యిచ్ఛయే నాకు పరమ ప్రీతికరమై నీ కిష్టములేని విషయములపై నా మనస్సు పోకుండగను, నాకు విధాయకమైన యేకృత్యమును నేను మానకుండగను కటాక్షింపుము. దినములు గడచుకొలంది ఒక దినముకంటె నింకొకదినము నేను నిన్నెక్కువగా సమీపించునటులును సర్వదా నీకువిధేయుడనై నేను ప్రవర్తించునటులను నా యావజ్జీవనమును నీతోడి నిరంతర సంయోగముగ మారిపోవునటులను కరుణింపుము.

ఉదయాంతాది, మహాత్తరోప కృతులెన్నో చేసితి, నీశ్వరా!
పదరైనం గదలింప శక్తులమె దేవా! నీ వుపేక్షించినన్;
[illegible] చెప్పగా గనని మేమంబీవు తోడ్పాటుచే,
ఓ! గైకొను నమస్సుల్, భక్త చింతామణీ!

